# దేవుని చిహ్నము




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**





# దేవుని చిహ్నము

రచయిత


ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, అర్ధ శతాధిక గ్రంథకర్త

ఇందూజ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–37 ప్రథమ ముద్రణ : సం॥ 2015

ప్రతులు : 1000 **వెల : 70 /-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక రచనలు

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

1) త్రైత సిద్ధాంత భగవద్గీత.
2) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
3) ధర్మము-అధర్మము.
4) ఇందుత్వమును కాపాడుదాం.
5) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
6) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
7) సత్యాన్వేషి కథ.
8) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా)
9) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా.
10) గీతా పరిచయము (తెలుగు,ఇంగ్లీషు)
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా)
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు.
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?)
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?)
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) మతాతీత దేవుని మార్గము.
37) దేవుని గుర్తు - 963.
38) మతము-పథము.
39) ప్రబోధానందం నాటికలు.
40) ఇందువు క్రైస్తవుడా?
41) నిగూఢ తత్త్వార్థ బోధిని.
42) ఆత్మలింగార్థము.
43) నాస్తికులు-ఆస్తికులు.
44) హేతువాదము-ప్రతివాదము.
45) గుత్తా.
46) ప్రబోధ తరంగాలు.
47) త్రైత సిద్ధాంతము.
48) రూపము మారిన గీత.
49) ఉపనిషత్‌లలో లోపాలు.
**50) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**51) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**52) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**53) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**
54) ద్రావిడ బ్రాహ్మణ.
55) తీర్పు.
56) కర్మ పత్రము.
57) ప్రవక్తలు ఎవరు?
58) ధర్మశాస్త్రము ఏది?
59) మత మార్పిడి దైవద్రోహము.
60) త్రైతశక పంచాంగము.
61) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
62) స్వర్గము ఇంద్రలోకమా! - నరకము యమరాజ్యమా!!
63) జీహాద్ అంటే యుద్ధమా?
64) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
65) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
66) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
67) వార్తకుడు-వర్తకుడు.
68) దేవుని చిహ్నము.

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక ప్రసంగాలు 

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూమహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవునిజ్ఞానము-మాయమహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.

*DVD'S*

53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
    కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము
63. సహజ మరణం-
    తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము
65. దేశం మోసం-దేహం మోహం
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము
68. మేఘం ఒకభూతం-
    రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు-
    అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప
76. నటించే ఆత్మ
77. సంచిత కర్మ
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము
81. టక్కుటమారా, ఇంద్రజాల
    మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ.
82. భయం
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది.
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

-: యూ ట్యూబ్ వీడియోలు :-

http://www.youtube.com/channel/UCkrD6R8nEU0-O7gNn46Ktfw

# ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 9866512667, 9951675081, Fax : 08558-225966.

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
**దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం**
Cell:9491040963, 9491877239, 9848590172.

*****

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం
Cell : 09445554354.

*****

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Cell : 70950 08369

*****

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

*****

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505768181

*****

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), నెల్లూరు జిల్లా.
Cell : 9494631664,9490809181, 8106065300.

*****

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

*****

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

*****

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**కె.లక్ష్మినారాయణాచారి** (ప్రెసిడెంట్)
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం, అనంతపురం (జి)
Cell:9440556968,9290012413,9440601136.

*****

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 9705959390, 9985580099

*****

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

*****

**టి. వీరనారాయణ రెడ్డి** (ప్ర.సభ్యుడు)
బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,నెల్లూరు జిల్లా
Cell : 9494618322, 8374923363

*****

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

*****

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా Cell : 9440305700,

*****

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell:9440047256, 9701956599

*****

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్
7674979663, 9440042763, 8977713666, 9247826253

# ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా

**చెన్న ఆంజనేయులు** (కరస్పాండెంట్)
జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782

*****

**డా॥బి. ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737

*****

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

*****

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్) : 9493622669
క్రొత్త చెరువు (గ్రా, మం) అనంతపురం జిల్లా.
9959316410, 9949995090.

*****

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,గుంటూరు (జి)
Cell : 9948014366, 9052870853

*****

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

*****

**వై. రేణుక దేవి** (ఇ.సభ్యులు)
పద్మావతినగర్, తిరుపతి టౌన్
Cell : 9491773455, 9032903955.

*****

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902,

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి (మం),
విశాఖపట్నం (జిల్లా), 9441567394, 9502172711.

*****

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,విశాఖపట్నం (జిల్లా)
Cell : 7396492239, 9248315309, 7386212589.

*****

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట (మం), వనపర్తి (తా)
మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 8790558815, 9440655409, 9701261165.

*****

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం), శ్రీకాకుళం
Cell : 9494248963, 9959779187.

*****

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం 1టౌన్, ప.గో.జిల్లా
Cell : 9948275984, 7386433834.

*****

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 8185020272.

*****

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
నేతాజిరోడ్డు కుప్పం,చిత్తూరు జిల్లా.
Cell : 9652755110,

*****

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్ర.సభ్యుడు)
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

# దేవుని చిహ్నము

దేవుని యొక్క గుర్తును 'దేవుని చిహ్నము' అని అనవచ్చును. చిహ్నము అనగా 'గుర్తు' అయినప్పుడు దేవుని చిహ్నము అంటే దేవుని శక్తితో సమానమైన లేక దేవుని విలువతో సమానమైన గుర్తు అని చెప్పవచ్చును. ఏదీకాని వాడు 'దేవుడు' అయినప్పుడు దేవునికి గుర్తు అంటూ ఉంటుందా? యని ఎవరయినా ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగా కలదు. దేవుడు అనగా వెతకబడేవాడుగానీ, కనిపించేవాడు కాదు. దేవుడు అనగా ఉండేవాడేగానీ, దొరికేవాడు కాదు. దేవుడు అనగా క్రియలేనివాడు గానీ, క్రియలు చేయువారికి క్రియలు చేయని దేవుడు తెలియడు. ఎవరు ఏ విధముగా యోచించినా తెలియనివాడు దేవుడు. అందువలన ఆయనను ఫలానాయని ఎవరూ చెప్పలేరు, ఆయనకు సంబంధించిన ఏ గుర్తును ఎవరూ చూపలేరు. అటువంటి పరిస్థితిలో దేవుని చిహ్నము అనునది ఒకటుందా? అని అడుగుటలో న్యాయము గలదు. హేతుబద్ధమైన ఈ ప్రశ్నకు మానవుల తరపునుండి జవాబు లేదు. అయితే ఈ ప్రశ్నకు దేవుడే తనమాటలో ఆయనకు ఒక గుర్తు కలదని చెప్పాడు. దేవుడు తన గుర్తును తానే చెప్పినపుడు మనుషులు తెలియగలరుగానీ, మనిషి స్వయముగా దేవున్ని గురించిగానీ, దేవుని గుర్తును గురించిగానీ చెప్పలేడు.

మనిషి చెప్పలేని దేవుని విషయమును దేవుడే చెప్పవలసియుండును. అంతిమ దైవ గ్రంథమయిన ఖురాన్‌లో సూరా 3 ఆయత్ 7 ప్రకారము **'దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఏ మానవునికీ తెలియదను',** ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీత రాజవిద్యా రాజగుహ్యా యోగము 2వ శ్లోకము ప్రకారము **'దేవుని జ్ఞానము రహస్యములలోకెల్ల రహస్యమైనదని',** మధ్య

దైవగ్రంథము బైబిలులోని యోహాన్ సువార్త మొదటి అధ్యాయము 5వ వాక్యము ప్రకారము **‘ఆ వెలుగు చీకటిలో ప్రకాశించుచున్నదిగానీ చీకటి దానిని గ్రహించకుండెను’.** దేవుని జ్ఞానముగానీ, దేవుని గుర్తుగానీ ఏ మానవునికీ తెలియదు. దేవుని జ్ఞానమయినా, దేవుని గుర్తయినా దేవుడే మనిషికి చెప్పవలసియున్నది. మూడు దైవగ్రంథముల సాక్షిగా మనిషికి దేవున్ని గురించి ఏమీ తెలియదు. దేవుడు చెప్పినప్పుడు దేవుని బోధ ద్వారా మనిషి తెలియవలసియున్నది. అయితే దేవుడు ఎప్పుడు చెప్పునో? ఎలా చెప్పునో? ఎవరికీ తెలియదు. అందువలన దేవుడు వచ్చి చెప్పినా, మనిషి దేవుడు చెప్పిన జ్ఞానమును నమ్మలేకున్నాడు. దేవుడు స్వయముగా జ్ఞానమును చెప్పినప్పుడు మనిషి దానిని సులభముగా తెలియవలసి యుండినా, చెప్పేవానిమీద నమ్మకము లేనిదానివలన దేవుడు చెప్పినా చెప్పేవాడు దేవుడనిగానీ, చెప్పబడేదే అసలయిన జ్ఞానమనిగానీ మనిషి తెలియలేకపోవుచున్నాడు.

దేవుడు స్వయముగా నా జ్ఞానము నాకే తెలియునని చెప్పి, తానే తన జ్ఞానమును తెలియజేయునప్పుడు మనిషి దేవుని జ్ఞానమును తెలియ వచ్చును. అట్లే దేవునికి సంబంధించిన గుర్తును (చిహ్నమును) కూడా తెలియవచ్చును. ఇక్కడ కొందరికి ఒక ప్రశ్న రావచ్చును. అదేమనగా! దేవుడే స్వయముగా తన జ్ఞానమును చెపినప్పుడు బుద్ధి శ్రద్ధయున్న వారు దానిని గ్రహించవచ్చును. అయితే దేవుడు చెప్పని దేవుని గుర్తును ఆయన జ్ఞానము ద్వారా ఎలా తెలియవచ్చును? అని అడుగుటకు అవకాశము గలదు. దానికి మా జవాబు ఈ విధముగా కలదు. ఒక ఇంటిని గురించి వర్ణించి చెప్పినప్పుడు తెలివైనవారు ఆ ఇంటి ఆకారమును చిత్రించు కోవచ్చును. ఇంటికి ఫలానా దిక్కున వాకిలి కలదనీ, దానికి ఇంతే

దూరములో కిటికీ కలదనీ, ఆ కిటికీకి ఎడమ ప్రక్కన వంటగది, కుడిప్రక్కన పడకగది, దానికి వెనుక స్నానాలగది అని ఇంటి వివరమును చెప్పినపుడు ఆ ఇంటిని అంచనా వేసి చిత్రించి చూపవచ్చును. అదే విధముగా దేవుడు తనను గురించి తానే స్వయముగా చెప్పినప్పుడు దేవునిమీద శ్రద్ధ, బుద్ధి గల మనిషి దేవుని చిహ్నమును చిత్రించుకోవచ్చును. దేవుని జ్ఞానము ఒక మతమునకు సంబంధించినది కాదు. దేవుని జ్ఞానము మానవ జాతికి సంబంధించినది అయినందున దేవుని చిహ్నము కూడా మొత్తము మానవ జాతికి సంబంధించినదిగా ఉండునుగానీ, ఒక మతమునకు సంబంధించి యుండదు.

ప్రస్తుత కాలములో భూమిమీద పన్నెండు మతములున్నవి. ఒక్కొక్క మతము ఒక గుర్తునుగానీ, అంతకంటే ఎక్కువ రెండు లేక మూడు గుర్తులు కల్గియుండడము చూస్తూనే ఉన్నాము. శిలువ గుర్తును చూస్తూనే ఇది క్రైస్తవము అని వెంటనే చెప్పవచ్చును. అలాగే నిలువు నామములనుగానీ, అడ్డనామములనుగానీ, 'ఓం' కారమునుగానీ చూస్తూనే ఇది హిందువుల గుర్తని చెప్పవచ్చును. అట్లే చంద్రవంక, నక్షత్రమును చూచినా, మక్కాలోని కాబా గృహము బొమ్మను చూచినా, ఇది ఇస్లామ్ మతము యొక్క గుర్తని ప్రజలు చెప్పుచుందురు. అయితే దేవుని గుర్తుకు ఏ మతము సంబంధము లేదని చెప్పవచ్చును. దేవుని చిహ్నము దేవుడు చెప్పిన జ్ఞానమునుబట్టి తయారయి వుండును, అందువలన అది ఏ మతమునకు సంబంధము ఉండదు. దేవుని చిహ్నము దైవగ్రంథములతో సంబంధపడియుండునుగానీ, మతములతో సంబంధపడియుండదు. ఇంటివర్ణననుబట్టి ఇల్లును చిత్రించినట్లు దేవుని జ్ఞానమునుబట్టి దేవుని చిహ్నమును చిత్రించవచ్చును. ఇక్కడ కొందరు ఒక ప్రశ్నను అడుగవచ్చును. అదేమనగా! దేవుడు తన

జ్ఞానమును చెప్పాడుగానీ, తన చిహ్నమును గురించి ఎక్కడా చెప్పలేదు కదా! అటువంటప్పుడు మీరెందుకు దేవుని జ్ఞానమునకు ఒక చిహ్నముంది అని చెప్పుచున్నారు? అని అడుగవచ్చును. దానికి జవాబు ఈ విధముగా కలదు. ప్రతి దానికి ఒక స్థూలము, ఒక సూక్ష్మము తప్పక ఉండును. ఒక మనిషిని తీసుకొని చూస్తే స్థూలము, సూక్ష్మము అను రెండు రకములుగా ఉన్నాడు. అదే విధముగా దేవుని జ్ఞానము కూడా స్థూల, సూక్ష్మరూపములలో ఉన్నదని చెప్పవచ్చును. దేవుడు సూక్ష్మమైనవాడు, కనిపించేవాడు కాదు అనుమాట వాస్తవమే. అయితే దేవుడు సూక్ష్మమే కాకుండా స్థూలముగా కూడా ఉన్నాడు. స్థూలముగా ఉన్నవానిని దేవుడు అనకూడదు. స్థూలముగా కనిపించునట్లున్న దేవున్ని 'భగవంతుడు' అని చెప్పాలిగానీ 'దేవుడు' అని చెప్పకూడదు. దేవుడు ఒకడే అయినా స్థూలముగా భగవంతుడనీ, సూక్ష్మముగా దేవుడని చెప్పవలెను. స్థూలముగా ఉన్నప్పుడు దేవుడనీ, సూక్ష్మముగా ఉన్నప్పుడు భగవంతుడని చెప్పకూడదు. చాలామందికి దేవుని స్థూల, సూక్ష్మతలను గురించి తెలియదు. కొందరు దేవుడు స్థూలముగా ఉండడని చెప్పుచుందురు. వారికి అంతవరకే తెలుసు, కావున వారు అంతవరకే మాట్లాడుచుందురు.

**దేవుని గురించి తెలుసుకొను శక్తిని మనిషికి దేవుడే ఇవ్వాలి.** లేకపోతే మనిషి స్వయముగా దేవున్ని గురించి తెలియలేడు. దేవుడు తన జ్ఞానమును బోధల రూపములో మరియు గ్రంథరూపములో మనుషులకు ఇచ్చినా, అది అర్థమగుటకు దేవుని అనుమతి మనిషికి ఉండాలి. దేవుడు మనిషి భావమునుబట్టి, వాని విధానమునుబట్టి దేవునికి ఇష్టమైతే వానికి జ్ఞానము అర్థమగునట్లు చేసి మంచిమార్గములో పంపును, లేకపోతే దేవునికి వాడు ఇష్టపడకపోతే వానికి తన జ్ఞానము అర్థము కాకుండా చేసి

చెడుమార్గములో అయినా పంపును. ఇదే విషయమునే "అంతిమ దైవ గ్రంథము ఖురాన్"లో చాలామార్లు చెప్పాడు. "ప్రథమ దైవగ్రంథము భగవద్గీత"లో కూడా చెప్పాడు. దేవుడు తనకిష్టమైన వారిని జ్ఞానమార్గము లోనూ, ఇష్టములేనివారిని అజ్ఞాన మార్గములోనూ పంపుననుట దేవుడు చెప్పిన విషయమే, కావున దేవుని జ్ఞానము కొందరికి సంపూర్ణముగా అర్థమవుతుంది. కొందరికి అసంపూర్ణముగా నిలిచిపోయింది. అసంపూర్ణ జ్ఞానులకు దేవుని సంపూర్ణత తెలియదు. అందువలన తమకు తెలిసిందే జ్ఞానమనుకొని, తెలియనిదంతా అజ్ఞానమనుకోవడము జరుగుచున్నది. ఈ విధముగా కొన్ని మతముల వారికి దేవుని స్థూలజ్ఞానము మాత్రమే తెలుసు, మరికొన్ని మతముల వారికి దేవుని సూక్ష్మము మాత్రమే తెలుసు, స్థూలము ఏమాత్రము తెలియదు. సంపూర్ణ జ్ఞానులకు దేవుని స్థూల, సూక్ష్మములు రెండూ తెలియును. సంపూర్ణ జ్ఞానులు భూమిమీద అరుదుగా ఉండుట వలన, ఒకవేళ ఉండినా వారి మాటను ఎవరూ వినకపోవడము వలన, భూమిమీద ఎక్కువ అజ్ఞానము మిగిలివున్నదని చెప్పవచ్చును.

దేవుడు 'నిరాకారుడు' అని నిర్ణయించి చెప్పుటకు వీలులేదు. అట్లని 'సాకారుడు' అని చెప్పుటకు కూడా వీలులేదు. దేవుడు సాకారుడు, నిరాకారుడు రెండు రకములుగా ఉన్నాడు. దేవుడు ఎవరి నిర్ణయానికీ అందనివాడు. అందువలన దేవుడు ఎప్పుడు, ఎట్లుండునది ఎవరూ చెప్పుటకు వీలులేదు. అందువలన దేవుడు ప్రత్యక్షముగా సాకారరూపమున మనముందరయున్నా మనము ఆయనను గుర్తించలేము. దేవుని జ్ఞానము ప్రకారము దేవున్ని స్థూల, సూక్ష్మములుగా చెప్పవచ్చునుగానీ, ఏ మనిషీ దేవున్ని సూక్ష్మముగాగానీ, స్థూలముగానీ కనుగొనలేడు. భూమిమీద ఇంతవరకు దేవున్ని నేను చూచాను అని చెప్పువాడు లేడు. ఇంతవరకు

ఎవరూ చూడలేదు. దేవుని జ్ఞానము వలన దేవున్ని తెలియవచ్చునని ఒక ప్రక్క చెప్పినా, అది మనిషి బ్రతికి యున్నప్పుడు జరుగని పని. దేవుని జ్ఞానముచేత దేవున్ని జీవిత అంత్యములో అనగా మరణములో తెలియవచ్చును, సజీవముగా ఉన్నప్పుడు ఎవరూ తెలియుటకు వీలులేదు. మనిషి సంపూర్ణ జ్ఞానమును తెలియగలిగితే వాడు దేవున్ని తెలియవచ్చును. అదే వానికి ఆఖరీ మరణమగును.

సాకారము నిరాకారము గల దేవుడు ఎవరికీ తెలియబడు వాడు కాదు. అది ఆయన నిర్ణయము. సాకార నిరాకారములలో అర్థము కాని అగమ్యగోచరుడయిన దేవున్ని ఆయన చెప్పిన జ్ఞానమునుబట్టి ఒక గుర్తుగా నిర్ణయించుకోవచ్చును. అలా దేవుని జ్ఞానముతో ఇమిడియున్న దేవుని చిహ్నము మతాలకు, మనుషుల జ్ఞానమునకు అతీతముగా ఉండును. **దేవుని చిహ్నము దేవుని జ్ఞానముతో కూడియుండును.** కనుక దేవుని చిహ్నమును విడదీసి చూస్తే అందులో దేవుని జ్ఞానమే బయల్పడును. దేవుని చిహ్నమును గురించి మూడు దైవగ్రంథములయిన భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలో ఉండగా ఆ విషయము ఏ మతస్థునికి అర్థము కాకుండా పోయినది. ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో అక్షర పరబ్రహ్మ యోగమున 28వ శ్లోకమందు దేవుని చిహ్నమును గురించి చెప్పియున్నా అది హిందువులకు ఎవరికీ అర్థముకాకుండా పోయినది. అలాగే ద్వితీయ దైవగ్రంథమయిన బైబిలులో యోహాను సువార్త 14వ అధ్యాయమందు ఆరవ వాక్యమున **(4-14-6) "నేనే మార్గమును, సత్యమును, జీవమును. నా ద్వారానే తప్ప ఎవడు తండ్రివద్దకు రాలేడు"** అని దేవుని గుర్తును గురించి చెప్పియున్నా, బైబిలు గ్రంథమును అనుసరించు క్రైస్తవులకు అక్కడ చెప్పిన దేవుని చిహ్నము అర్థము కాలేదు, ఇకపోతే అంతిమ దైవ

గ్రంథమయిన ఖురాన్ గ్రంథ విషయమునకు వచ్చి చూస్తే ఐదవ సూరా, రెండవ ఆయత్‌నందు (5-2) మరియు 22వ సూరా 32వ ఆయత్‌నందు దేవుని చిహ్నమును గురించి చెప్పియున్నారు. **(5-2) "విశ్వసించిన ఓ ప్రజలారా! అల్లాహ్ చిహ్నాలనుగానీ, నిషిద్ధమాసమును గానీ అగౌరవ పరచకండి"** అని కలదు. అట్లే (22-32) **"అల్లాహ్ చిహ్నాలను ఎవరయినా గౌరవిస్తున్నారంటే అది వారి హృదయాలలోని భక్తి భావన వల్లనే సుమా!"** ఖురాన్ గ్రంథములో రెండుచోట్ల దేవుని చిహ్నమును గురించి చెప్పియున్నా అది ముస్లీమ్‌లకు అర్థము కాలేదనియే చెప్పవచ్చును. వారికి అర్థము కాలేదను విషయము వారు ఈ రెండు వాక్యములకు వ్రాసిన వివరమును చూస్తే తెలిసిపోగలదు. ("అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్" అను గ్రంథమునుండి సేకరించిన వివరమును ఇక్కడ పొందు పరుస్తున్నాము.)

**(5-2) వివరణ :-** అరబ్బీ భాషలో "షఆయిర్" అని వుంది. ఇది 'షయీరతున్'కు బహువచనము. 'షఆయిర్' అంటే చిహ్నాలు, సూచనలు అని అర్థము. దేవుడు ఏయే వస్తువులను భక్తికి పవిత్రతకు సూచనలుగా చేశాడో వాటిని దేవుని చిహ్నాలుగా పరిగణిస్తారు. కొంతమంది విద్వాంసులు ఈ పదమును సర్వసాధారణ భావముతో తీసుకోగా, మరి కొంతమంది హజ్, ఉమ్రాలకే పరిమితము చేశారు. అంటే హజ్, ఉమ్రా యాత్రలలో చేయవలసిన పనులన్నమాట. అలాగే హజ్ ఉమ్రాల సంకల్పముతో దైవగృహమువైపుకు సాగిపోయే వారిని అడ్డుకోవడము కూడా దేవుని చిహ్నాలను అగౌరవపరచడము క్రిందికే వస్తుంది. (ఇప్పుడు 22-32 ఆయత్‌కు గల వివరమును చూస్తాము) 'షఆయిర్' అంటే గుర్తులు, చిహ్నాలు అని అర్థము. 'సంకేతము' అనికూడా ఒక అర్థము వస్తుంది. యుద్ధాల, సైనిక చర్యల కోసము కూడా కొన్ని సంకేత పదాలను ఉపయోగిస్తారు.

ఆ కోడ్‌ను (గుర్తును) సంబంధిత వ్యక్తులు మాత్రమే గ్రహించగలుగుతారు. అలాగే దేవుని చిహ్నాలు అంటే ఇస్లామ్ ధర్మవైశిష్ట్యాన్ని, ప్రత్యేకతను చాటిచెప్పే ఆదేశాలు అన్నమాట. వాటి ద్వారా ఒక ముస్లీమ్ బాహ్యాప్రపంచములో తన వ్యక్తిత్వాన్ని, వైశిష్ట్యాన్ని చాటిచెపుతాడు. ఇతర మతాలనుండి ఆ చిహ్నాలు అతన్ని స్పష్టముగా వేరు పరుస్తాయి. మక్కాలోని సఫా, మర్వా పర్వతాలు కూడా దేవుని చిహ్నాలుగా ఖరారు చేయబడ్డాయి. ఎందుకంటే ముస్లీమ్‌లు హజ్, ఉమ్రాల సందర్భముగా ఈ రెండు కొండలమధ్య 'సయీ' చేస్తారు. ఈ ఆయత్‌లో హజ్‌లోని ఇతర క్రియలు కూడా దైవచిహ్నాలుగా చెప్పారు. ముఖ్యముగా ఖుర్బానీ పశువులు దైవచిహ్నాలుగా వర్ణించబడ్డాయి. వాటిని గౌరవించడము అంటే అర్థము ఏమిటి? బలిష్టమైన ఏ లోపములేని పశువులను ఖుర్బాని ఇవ్వటము. ఈ త్యాగము (ఖుర్బాని) భయభక్తులకు ఆనవాలుగా చెప్పబడినది. భయము భక్తి (తఖ్వా) అన్నది ఆంతర్యముతో ముడిపడిన విషయము, అది పైకి కనిపించదు. ఆంతర్యము ఎంత నిర్మలముగా ప్రకాశవంతముగా ఉంటుందో ఆరాధన కూడా అంతే స్వచ్ఛముగా, గొప్పగా ఉంటుంది.

ఈ విధముగా దేవుని చిహ్నామును గురించి ఎందరో ఎన్నో అభిప్రాయములను వెలిబుచ్చారు. ఖచ్చితముగా ఇది అని చెప్పక ఎవరి ఇష్టమొచ్చినట్లు వారు చెప్పారు. ఇదంతా చూచిన తర్వాత ఒక సామెత గుర్తుకు వస్తుంది. అదేమంటే "హద్దు పద్దూ లేనివానికి కనిపించిన చోటంతా పడక స్థలమే" అన్నట్లున్నది. దేవుని జ్ఞానమంతయు శాస్త్రబద్ధతతో కూడుకొని యుండగా, ఎంతో గొప్పదయిన దేవుని గుర్తును ఏమాత్రము శాస్త్రీయత లేకుండా, ఎవరి ఇష్టమొచ్చినట్లు వారు పోల్చుకోవడము సమంజసమా? దేవుడు ఒప్పుకొంటాడా? అని అడుగుచున్నాము. దేవుని చిహ్నాము ధర్మముతో కూడుకొన్నదనుట న్యాయమగును.

ఒక మతమును సూచించునది దేవుని చిహ్నము అనుట పూర్తి అజ్ఞానమగును. మతాలకు అతీతమైనది దేవుని చిహ్నముకాగా దానిని ఒక మతమునకు అంటగట్టడము అజ్ఞానముకాక ఏమగును. అంతేకాక ఖుర్బాని పశువులను దేవుని చిహ్నములుగా భావించడము దేవున్ని, దేవుని చిహ్నమును పూర్తి అగౌరవపరచినట్లేయగును. బలిసిన పశువులను దేవునికి ఖుర్బాని ఇస్తే దేవుని చిహ్నమును గౌరవించినట్లని, బక్కచిక్కిన బలహీన పశువులను అర్పించడము (బలి ఇవ్వడమును) దేవుని చిహ్నమును అగౌరవ పరచినట్లని చెప్పడము మరీ విచిత్రముగా ఉన్నది. జ్ఞానము తెలియనివారు తెలియనట్లుండడము మంచిదిగానీ, జ్ఞానమును వక్రమార్గములో చెప్పడము దేవున్ని కించపరచినట్లగును. దేవుడు సర్వదర్శి, ఆయన అన్నిటినీ అందరినీ గమనించుచుండును.

దేవుని గుర్తు దేవుని జ్ఞానమును తెలుపునదిగా ఉండును. **దేవుని జ్ఞానముతో సమానమైనది దేవుని చిహ్నము.** దేవుడు తన గ్రంథములో తన గుర్తును గురించి చెప్పుచూ తన గుర్తును అగౌరవపరచకూడదన్నాడు. అంతేగానీ తన గుర్తు ఫలానాయని విడదీసి చెప్పలేదు. దేవుడు తనగుర్తు ఫలానా అని చెప్పకున్నా, మనిషి దేవుని గుర్తును అనేక రకాలుగా పోల్చుకోవడము జరిగినది. మనము పోల్చుకొన్నది అసలు దేవుని గుర్తేనా! అని ఏమాత్రము ఆలోచించకుండా మనిషి నిర్ణయించుకోవడము మానవ తప్పిదమగును. దేవుడు తన గుర్తును గురించి చెప్పాడు అంటే అది దేవుని జ్ఞానముతో కూడుకొన్నదై, దేవుని విలువతో సమానమై ఉంటుందని మనిషి ఏమాత్రము గ్రహించలేకపోయాడు. దేవుడు సర్వమానవులకు సంబంధించినవాడు. సర్వమానవులకు సంబంధించిన బోధను జ్ఞానముగా చెప్పినవాడుగా ఉన్నాడు. అటువంటి వానిని ఒక మతమునకు సంబంధించి చెప్పడమే పెద్ద పొరపాటు.

దైవగ్రంథములలో దేవుని జ్ఞానముతో ఏర్పడినదే దేవుని చిహ్నము అని తెలియుచున్నది. ప్రథమ దైవగ్రంథము భగవద్గీతలో అక్షర పరబ్రహ్మ యోగమున చివరి మూడు శ్లోకములయిన 26, 27, 28 శ్లోకములలో దేవుని చిహ్నమును గురించి చెప్పడము జరిగినది. అక్కడ చెప్పిన జ్ఞానమును స్థూల చిహ్నముగా చూచుకోవచ్చును. 26, 27 శ్లోకములలోని జ్ఞానము దేవుని గుర్తుకు నాంది పలుకుచున్నది. **28వ శ్లోకమున దానిని తెలిసిన వాడు "వేద, దాన, యజ్ఞ, తపస్సులను మించిన యోగియై, మోక్షమును పొందును"** అని కలదు. దేనిని తెలిస్తే మోక్షమును పొందవచ్చునని చెప్పాడో కొద్దిగా యోచిస్తే అదే దేవుని గుర్తని తెలియగలదు. అదే విధముగా ద్వితీయ దైవగ్రంథమయిన బైబిల్‌లో యోహాన్ సువార్త 14వ అధ్యాయమున 6వ వాక్యమందు **(4-14-6) ఏసు "నేనే మార్గమును, సత్యమును, జీవమును, నా ద్వారా తప్ప యెవడును తండ్రివద్దకు రాడు" (7) "మీరు నన్ను ఎరిగియుంటే నా తండ్రిని ఎరిగియుందురు. ఇప్పటినుండి మీరు ఆయనను ఎరుగుదురు, ఆయనను చూచియున్నారని చెప్పెను"** ఈ రెండు వాక్యములలోనూ దేవుని గుర్తుకు సంబంధించిన జ్ఞానము కలదు. దేవుని జ్ఞానము సూక్ష్మముగాయున్నా, అదే జ్ఞానమే స్థూలముగా తయారయితే దేవుని గుర్తుగా మారగలదు. అలా తయారయిన దేవుని చిహ్నము దేవుని జ్ఞానముతో కూడుకొనియుండునుగానీ, మనుషుల మతములకు సంబంధించి యుండదు. బైబిలులో చెప్పిన దేవుని గుర్తు, భగవద్గీతలో చెప్పిన దేవుని గుర్తు, ఖుర్‌ఆన్‌లో చెప్పిన దేవుని గుర్తు మూడు ఒకే జ్ఞానముతో కూడుకొని యుండుట చేత దేవుని చిహ్నము ఒకే ఆకారమైన గుర్తుగా యున్నది. మూడు గ్రంథములలో చెప్పిన జ్ఞానము ఒకే గుర్తులో కనిపించుట వలన, అదే దేవుని గుర్తుగా దేవుడు చెప్పినట్లు తెలియుచున్నది.

ఇప్పుడు కొందరిలో ఒక ప్రశ్న పుట్టవచ్చును. అదేమనగా దేవుని గుర్తు ఒక్కటా లేక అనేకమా? దేవుని గుర్తు ఏకవచనమా, బహువచనమా? అని ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగా కలదు. దేవుడు ఒక్కడే అయినా దేవున్ని గౌరవార్థము బహువచనముగానే పిలువవచ్చును. దేవుడు ఒక్కడే అయినా ఆయన అంతటావున్నాడు అని చెప్పవచ్చును. అంతేకాక దేవున్ని స్త్రీలింగముగా అయినా చెప్పవచ్చును, పులింగముగా అయినా చెప్పవచ్చును. అట్లు చెప్పుటకు కారణము దేవున్ని స్త్రీలింగమునకు గానీ, పులింగమునకుగానీ, ఏకవచనమునకుగానీ, బహువచనమునకుగానీ పరిమితి చేసి చెప్పలేము. ఆయన అన్నిటికీ అతీతుడు. అందువలన దేవున్ని ఫలానాయని ఎవరూ నిర్ణయించుటకు వీలులేదు. అందువలన దేవున్ని అన్ని విధముల చెప్పవచ్చును.

దేవుని గుర్తు లేక దేవుని చిహ్నము అను విషయము నేడు ఆధ్యాత్మిక విద్యలో చాలా క్రొత్తదిగా కనిపించుచున్నది. దేవుని చిహ్నమును గురించి దేవుడు తన గ్రంథములలో పూర్వమునుండి చెప్పుచున్నప్పటికీ, దానిని ఎవరూ గ్రహించకపోవడము వలన, ఇప్పుడు మేము ఈ విషయమును చెప్పితే అందరికీ క్రొత్తగా కనిపించుచున్నది. అందువలన చాలామందికి చాలా సంశయములు ఈ దేవుని చిహ్నము గురించి కలవు. వారి సంశయములను ప్రశ్నల రూపముగా అడిగితే అనేక విధములుగా కనిపించగలవు. వాటికి తగిన విధముగా సమాధానములను కూడా చూడవచ్చును.

**ప్రశ్న :-** మూడు దైవగ్రంథములలో దేవుని సాకార గుర్తు ఉన్నప్పుడు, అది ఏ మతమునకు సంబంధించినదని చెప్పవలెను?

**జవాబు :-** మూడు దైవగ్రంథములలో ఒకే దేవుని జ్ఞానమే కలదుగానీ వేరు ఏమీలేదు. దేవుడు ఏ మతమువాడో ఎవరయినా చెప్పగలరా? చెప్పుటకు వీలులేదు. ఎందుకనగా! దేవుడు తన జ్ఞానములో ఎక్కడా ఏ మతమును గురించి చెప్పలేదు. దేవుడు చెప్పిన జ్ఞానమంతయు మనిషికి సంబంధించినదిగా ఉన్నదిగానీ, మతమునకు సంబంధించినదిగా లేదు. దేవుడుగానీ, దేవుని జ్ఞానముగానీ ఏ మతమునకు సంబంధము లేనప్పుడు దేవుని గుర్తును మత సంబంధమైనదని చెప్పుటకు వీలులేదు. దేవుడు తన జ్ఞానమును మూడు విధముల భూమిమీద ప్రజలకు తెలియజేతునని అంతిమ దైవగ్రంథమయిన "ఖుర్ఆన్"లో 42వ సూరా 51వ ఆయత్‌లో చెప్పాడు. అదే విధముగా దేవుడు ప్రత్యక్షముగా ఎవరితోనూ మాట్లాడకుండా, కాలానుగుణముగా మనకు తెలిసి మూడుచోట్ల తన బోధను తెలియజేశాడు అని తెలియుచున్నది. దేవుడు ఎప్పుడు ఎక్కడ తన బోధను తెలిపినా అది సర్వజీవరాశులకు సంబంధించినదిగానే ఉన్నది. అయితే దానిని వినిన మనిషి దేవుని జ్ఞానమునకు మతము అను రంగుపూసి, తన స్వార్థముతో మతములను తయారు చేసుకొన్నాడు. మనిషి అజ్ఞానము చేత మతములు తయారైనవి. దేవుడు మూడు సమయములలో ఇచ్చిన మూడు దైవగ్రంథములకు మూడు మతములను మనిషి ఆపాదించాడు. దానిప్రకారము భగవద్గీత హిందువులదనీ, బైబిలు క్రైస్తవులదనీ, ఖురాన్ ముస్లీమ్‌లదనీ చెప్పుచున్నారు. వాస్తవానికి **మూడు దైవగ్రంథములకు మూడు మతములకు ఏమాత్రము సంబంధము లేదు.** అందువలన మూడు గ్రంథములలో చెప్పిన దేవుని చిహ్నము మత సంబంధమైనది కాదని చెప్పవచ్చును. దేవుడు చెప్పినది సూక్ష్మమైన జ్ఞానము. సూక్ష్మమైన జ్ఞానములోనే స్థూలమైన గుర్తును గుర్తించుకొనునట్లు దేవుడు తన బోధలను

కొంతమలుపు త్రిప్పి చెప్పాడు. దేవుడు చెప్పిన జ్ఞానమును బట్టి దైవచిహ్నమును మనము తయారు చేసుకోవచ్చును. దేవుని చిహ్నము దేవుని జ్ఞానముతో తయారయినది కావున అందులో దేవుని జ్ఞానము, దేవుని ధర్మములు ఉండును. అంతతప్ప దేవుని గుర్తు ప్రపంచ విషయములకు ప్రతిరూపము కాదు. కొందరు దేవుని గుర్తును అనేక విధములుగా ప్రపంచ సంబంధ వస్తువులుగా, ప్రాణులుగా చెప్పుకోవడము జరిగినది. చివరకు దేవునికి బలిరూపములో అనగా ఖుర్బాని రూపములో ఇచ్చు పశువులను కూడా దేవుని గుర్తులుగా చెప్పుకోవడము జరిగినది. అంతేకాకుండా బలహీనమైన పశువులను దేవునికి బలి ఇస్తే దేవుని గుర్తును అగౌరవపరచినట్లనీ, బలమైన బలిసిన పశువులను దేవునికి సమర్పిస్తే దేవుని గుర్తును గౌరవించినట్లు అని కూడా వ్రాశారు. చివరకు దేవుని గుర్తు దేవుని జ్ఞానమునకు సంబంధము లేకుండా మనిషి భావములో ప్రపంచ సంబంధ వస్తువుల వరకు, పదార్థముల వరకు, జంతువుల వరకు పోయిందంటే మనుషులు ఎంత అజ్ఞానములో కూరుకపోయారో చెప్పకనే తెలియుచున్నది. దేవుడు చెప్పిన దేవుని చిహ్నము దేవుని జ్ఞానముతో కూడుకొన్నదై దేవుని జ్ఞానమునకు ప్రతిరూపముగా ఉన్నదని చెప్పవచ్చును. అందువలన దేవుని గుర్తు మత సంబంధమైనది కాదని తెలియవలెను.

**ప్రశ్న :-** 'ఓం' అను గుర్తును చూస్తే హిందువులు గుర్తుకొస్తారు. అట్లే సిలువ గుర్తును చూస్తే క్రైస్తవులు జ్ఞాపకము వస్తారు. దేవుని గుర్తును చూచి ఎవరిని గుర్తించవచ్చును?

**జవాబు :-** 'ఓం' హిందువులదని, సిలువ క్రైస్తవులదని చెప్పుకొనుట మనుషులకు అలవాటైపోయినది. ఇక్కడ ఆ రెండిటి విషయములో కూడా మనిషి తెలివి తక్కువలోగల అజ్ఞానము బాగా కనిపించుచున్నది. ప్రపంచ

సంబంధముగా గానీ, దైవసంబంధముగా గానీ ఎటు చూచినా "ఓం" అను అక్షరము హిందువుల జ్ఞానములో ఒక ముఖ్యమైన గుర్తుగా కనిపించుచున్నది. 'ఓం' అను శబ్దము సర్వమంత్రములకు మొదటి బీజాక్షరముగాయున్నది. అందువలన ప్రతి మంత్రము ముందర 'ఓం' అను శబ్దముండును. అంతేకాకుండా భగవద్గీతా గ్రంథములో కూడా అక్షర పరబ్రహ్మయోగము అను అధ్యాయమున 13వ శ్లోకమందు 'ఓం' ప్రణవాక్షరమును గురించి చెప్పడము జరిగినది. దానివలన ఆధ్యాత్మికములో ఓం అను అక్షరమునకు ప్రముఖ స్థానముగలదు. అంటే అది దైవ జ్ఞానమునకు దగ్గరగాయున్నదని తెలియుట వలన, దానిని హిందువులు గుర్తుగా చెప్పుకొనినా నష్టమేమి లేదు. అది దైవసంబంధ జ్ఞానముతో ముడిపడి ఉండుటవలన దానిని హిందువుల గుర్తని చెప్పినా అజ్ఞానమే కాదు. అయితే బైబిలుయందు సిలువ ప్రస్తావన వచ్చియున్నా, అది దైవజ్ఞానముతో ఎటువంటి సంబంధము లేకుండా ఉన్నది. పైగా ఏసు మరణములో ప్రముఖపాత్రగల్గినదిగా, ఏసును చంపడములో ఆయుధముగా సిలువ గలదు. ఏసే దేవుడని చెప్పు కొందరు క్రైస్తవులు గలరు. ఏసే దేవుడను భావమున్నప్పుడు ఏసు మరణమునకు కారణమైన, ఏసు మరణములో ఉపయోగపడిన ముఖ్య ఆయుధముగాయున్న సిలువను ఎందుకు క్రైస్తవులు గౌరవించుచున్నారు. సిలువను ఎందుకు క్రైస్తవులు గుర్తుగా పెట్టుకొన్నారు? కృష్ణుడు చెప్పిన జ్ఞానములో ఓం అను అక్షరము గలదు. అయితే ఏసు చెప్పిన జ్ఞానములో సిలువ లేదు. బైబిలులో సిలువ ప్రస్తావన వచ్చినా అది అజ్ఞానమువైపునుండి వచ్చినదేగానీ, జ్ఞానము వైపునుండి రాలేదు. హిందువులు 'ఓం'ను తమ గుర్తుగా చెప్పుకోవడములో అర్థముందిగానీ, క్రైస్తవులు సిలువను తమ గుర్తుగా చెప్పుకోవడములో అర్థమే లేదు. ఇక్కడ అసలు విషయానికి వచ్చి దైవగ్రంథములో చెప్పిన

దేవుని చిహ్నమును చూస్తే దేవుని జ్ఞానమే గుర్తుకొచ్చును. అంతేగానీ దేవుని చిహ్నమును చూస్తే ఏ మతము గుర్తుకురాదు. దేవుని చిహ్నము దేవునికి, దేవుని జ్ఞానమునకు ప్రతిరూపముగా ఉన్నదిగానీ, అజ్ఞాన సంబంధమైన దేనికీ గుర్తుగా లేదని తెలియవలెను.

**ప్రశ్న :-** భగవద్గీతలో చెప్పిన 'ఓం'నకు ఆకారమున్నది. అలాగే బైబిలులో ప్రస్తావింపబడిన సిలువకు ఆకారమున్నది. అయితే భగవద్గీతలో చెప్పిన ఓం బైబిలులో లేదు. బైబిలులో చెప్పిన సిలువ భగవద్గీతలో లేదు. భగవద్గీత, బైబిలు, ఖురాన్ మూడు గ్రంథములయందు జ్ఞానరూపములో కలదను దేవుని గుర్తుకు స్థూలమైన ఆకారమున్నదా?

**జవాబు :-** స్థూలమైన ఆకారమున్నప్పుడే మనిషి కంటితో చూడగల్గును. అప్పుడే దానిని గుర్తించవచ్చును. గుర్తించినప్పుడే దానివెనుక దాగియున్న సమాచారమంతా జ్ఞాపకము రాగలదు. ఉదాహరణకు స్థూలముగా కనిపించు కర్పూరమును చూచినప్పుడు, దానివెనుక దాగియున్న హారతి జ్ఞాపకము రాగలదు. అట్లే హారతిలో ఉండే జ్ఞానము కూడా జ్ఞప్తికి రాగలదు. అదే విధముగా దైవచిహ్నమును ఆకార రూపములో చూచినప్పుడు, ఆ ఆకారములో ఇమిడియున్న జ్ఞానమంతయు జ్ఞాపకము రాగలదు.

**ప్రశ్న :-** ఇది దేవుని చిహ్నము అని తెలిసిన వానికి దానివెనుకయున్నదేదో జ్ఞాపకము రావచ్చును. అయితే దేవుని చిహ్నమంటే ఏమిటో? అది ఎట్లుంటుందో తెలియనివాడు దానిని చూచినా ఏమీ ప్రయోజనము లేదు కదా! అతనికి ఏ జ్ఞానము జ్ఞాపకము రాదు కదా!

**జవాబు :-** దేవుని గుర్తును ఒకమారు చూచి దాని వివరము తెలిసియున్న వాడు రెండవమారు చూడగలిగితే దానివలన ప్రయోజనముంటుంది.

ఒకమారు కూడా చూడనివానికి దానివెనుక గల సమాచారము జ్ఞాపకము రాదు. అయితే దేవుని చిహ్నమును క్రొత్తగా చూచిన ఎవరికయినా దానిని గురించి తెలుసుకోవాలను ఆసక్తి పుట్టుట తప్పక జరుగును.

**ప్రశ్న :-** దేవునికీ, దేవుని చిహ్నానికీ ఏమి తేడా ఉంటుంది?

**జవాబు :-** దేవుడు కనిపించడు, దేవుని చిహ్నము కనిపిస్తుంది.

**ప్రశ్న :-** దేవుడు కనిపించనప్పుడు దేవుని చిహ్నము కనిపించినా, ఇదే దేవుని చిహ్నమని ఎలా తెలియగలము? దేవుడు తన చిహ్నమును గురించి సూచన ప్రాయముగా ఖురాన్ గ్రంథములో (5-2), (22-32) ఆయత్‌లలో చిహ్నము అని పేరు చెప్పాడుగానీ తన చిహ్నము ఎలా ఉంటుందో కూడా చెప్పలేదు. అటువంటప్పుడు ఏది దేవుని చిహ్నము అని అనుకోవాలి?

**జవాబు :-** రాజు అను పేరును విన్నాము, పాతసినిమాలలో రాజులను కూడా చూచాము. రాజుచేత నిర్ణయించబడిన, రాజుకు గుర్తుగా నిర్ణయించబడిన దానిని రాజచిహ్నము అంటాము. రాజుకు ఎంత అధికార ముండునో, రాజచిహ్నమునకు కూడా అంతే అధికారముండును. రాజు ఎక్కడో అంతఃపురములో కూర్చొని రాజచిహ్నమును బయటికి పంపి తన పనులు చేయించుచుండును. రాజుకు మారుపేరుగా లేక రాజుకు మారురూపముగా ఉండు దానిని 'రాజముద్ర' లేక 'రాజచిహ్నము' అంటాము. రాజచిహ్నము రాజు స్వహస్తాలతో పెట్టిన సంతకము కావచ్చు లేక స్వహస్తములకు ధరించిన ఉంగరము కావచ్చును. ఒక రాజ్యములో రాజచిహ్నముగా నిర్ణయించబడినది మరియెక్కడా ఉండుటకు వీలులేదు. ఒక రాజుకు రాజచిహ్నము ఒక్కటే ఉండునుగానీ, రెండవది ఉండదు. పూర్వము రాజచిహ్నమును తీసుకపోయి రాజు భటులకు చూపితే, దానిని

రాజుయొక్క ప్రతినిధిగా భావించి, అక్కడ రాజు పంపిన సందేశమును నెరవేర్చెడివారు. ఉదాహరణకు కారాగారమునుండి ఒక ఖైదీని బయటికి తెచ్చుటకు రాజేవచ్చి విడుదల చేయమని చెప్పనవసరములేదు. రాజముద్ర అనబడు రాజుయొక్క గుర్తును తెచ్చి చూపి విషయమును చెప్పితే అక్కడ రాజు చెప్పినట్లే పని జరిగెడిది. రాజు కాకున్నా రాజుతో సమానమైన అధికారమును చూపుదానిని రాజచిహ్నము అంటాము. చిహ్నము అంటే 'గుర్తు' అని అర్థము. చిహ్నమును లేక గుర్తును ముద్ర అని కూడా అనవచ్చును. ముద్ర అనగా నిర్ణయించబడినదని అర్థము. రాజు వేరు, రాజముద్ర (చిహ్నము) వేరు అయినా రాజుకుగల అధికారము రాజ చిహ్నమునకు ఉండును. రాజును గౌరవించినట్లే రాజుయొక్క గుర్తును కూడా గౌరవింతురు. అదే విధముగా దేవుడు వేరు, దేవుని గుర్తు వేరయినా దేవునికున్న దైవశక్తి దేవుని చిహ్నములో కూడా ఉండును. రాజముద్రను (రాజచిహ్నమును) రాజుయొక్క సైన్యము గౌరవించినట్లే, దేవుని చిహ్నమును చూచి దేవదూతలు, గ్రహములు, భూతములు గౌరవించును. రాజముద్ర ప్రజలకు తెలియకున్నా, రాజు పాలనలోని పాలకులందరికీ తెలిసినట్లు, దేవుని గుర్తు ప్రజలకు తెలియకపోయినా దేవుని పాలనలోని భూతములకు, గ్రహములకు, దేవదూతలనబడు వారందరికీ తెలియును. ఖురాన్ గ్రంథములో రెండుచోట్ల దేవుడు తన చిహ్నమును గురించి చెప్పాడు గానీ అక్కడ ఫలానా విధముగా ఉండునదే తన చిహ్నమని చెప్పలేదు.

**ప్రశ్న :-** దేవుడు వివరించి చెప్పనిదే దేవుని గుర్తు ఫలానా అని ఎలా గుర్తించగలము?

**జవాబు :-** ఎక్కడయితే రాజుతో సమానముగా విలువనివ్వబడు గుర్తు గలదో, దానినే రాజముద్ర అని గ్రహించినట్లు, ఎక్కడయితే భూతములు,

గ్రహములు, దేవదూతలు దేవునితో సమానముగా విలువనిచ్చు గుర్తుకలదో, దేనిని వారందరూ గౌరవ భావముతో చూస్తున్నారో అదియే దేవుని గుర్తని తెలియవచ్చును. దేవుని గుర్తు దేవుని పాలనలోని అందరికీ తెలుసు. దేవుని జ్ఞానమున్న వారికి కూడా దేవుడు తన గుర్తును గురించి వివరించి చెప్పియుండవచ్చును. లేకపోతే జ్ఞాని అయినవాడు దేవదూతల ద్వారాగానీ, గ్రహముల వలనగానీ, భూతముల ద్వారాగానీ తెలిసియుండవచ్చును. మనకు తెలియనంతమాత్రమున ఇతరులెవరికీ తెలియదనుకోవడము పొరపాటగును. మనకు తెలియని జ్ఞానరహస్యములెన్నో ఇతరులకు తెలిసియుండవచ్చును. తెలియనప్పుడు తెలుసుకొనుట మానవుని కర్తవ్యము. తెలియబడిన విషయము శాస్త్రబద్ధమైనదో కాదో విశదీకరించి చూచి శాస్త్రబద్ధమైనదైతే, అందులో దేవుడు చెప్పిన శక్తియుంటే, దానిని దేవుని గుర్తుగా తెలియడములో తప్పులేదు కదా!

**ప్రశ్న :-** అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో సూరా 22, ఆయత్ 31యందు ఇలా ఉన్నది. **"ఏకాగ్రతతో దేవుని ఏకత్వాన్ని అనుసరిస్తూ ఆయనకు సాటి కల్పించకుండా ఉండాలి. అల్లాహ్‌కు సాటి కల్పించేవాడు ఆకాశమునుండి క్రింద పడిపోయిన వానితో సమానము. ఇప్పుడతన్ని పక్షులైనా తన్నుకపోతాయి. లేదా పెనుగాలి అయినా ఎత్తి దూరప్రదేశములో విసరివేస్తుంది."** ఈ విధముగా దేవుడు జిబ్రయేల్ ద్వారా చెప్పించాడు కదా! అటువంటప్పుడు ఎవరూ దేవునికి సమానముగా దేనిని కూడా కల్పించకూడదు కదా! అటువంటప్పుడు మీరు దేవుని శక్తితో సమానమైనది దేవుని గుర్తని, దేవుని హోదాతో సమానమైనది దేవుని చిహ్నమని, ప్రత్యేకించి ఒక చిహ్నమును చూపడము లేక ఉందని చెప్పడము దేవుని ఏకత్వమునకు భంగము కలిగించినట్లు కాదా! అటువంటప్పుడు

దేవుని శిక్షకు పాత్రులగుదురు కదా! దేవుడు చెప్పిన (22-31) వాక్యము తెలిసి దేవుని గుర్తనడము తప్పు కాదా?

**జవాబు :-** మేము అల్లా మాటను గౌరవిస్తాము. దైవగ్రంథములోని ఏ మాటకుగానీ వ్యతిరేఖముగా చెప్పడముగానీ, నడువడముగానీ మా జీవితముతో జరుగులేదు, జరుగబోదు. పై వాక్యములో దేవునికి సాటిగా దేనినిగానీ, ఎవరినిగానీ చెప్పకూడదు అలా చెప్పువాడు శిక్షార్హుడని ఉండుట సత్యమే. దేవునికి సమానమైన చిహ్నమును దేవుడే చెప్పాడుగానీ మనుషులయిన మేము చెప్పలేదు కదా! సూరా 5, ఆయత్ 2లో ఈ ఆయత్ కంటే ముందే తన చిహ్నమును గురించి చెప్పడమైనది. తర్వాత ఇక్కడ సూరా 22, ఆయత్ 32లో తన చిహ్నమును గౌరవించమని దేవుడే చెప్పాడు. 32వ ఆయత్‌కంటే ముందు 31వ ఆయత్‌లో దేవునికి సాటి కల్పించకూడదని హెచ్చరించడమైనది. అలా ముందే ఎందుకు చెప్పాడనగా! తన నిర్ణయమైన (దేవుని నిర్ణయమైన) చిహ్నమును కాదని, దాని స్థానములో ఇతరములను దేనినీ ప్రపంచ సంబంధమైన వాటిని కల్పించకూడదని హెచ్చరించుచూ చెప్పాడు. రాజముద్రకు రాజుతో సమానమైన విలువ ఉన్నట్లు, దేవుని ముద్ర అయిన తన చిహ్నమునకు తనతో సమానమైన విలువ ఉండునని, అటువంటి దాని స్థానములో మనుషులు ఎవరూ దేనినీ దేవుని చిహ్నములుగా చెప్పకూడదని ముందే 31వ ఆయత్‌లో చెప్పడము జరిగినది. అలా ముందే హెచ్చరించి చెప్పినప్పటికీ, కొందరు మనుషులు ప్రపంచ సంబంధ వస్తువులను, జంతువులను దేవుని చిహ్నములుగా వర్ణించి చెప్పడమైనది. అలా చెప్పడము దేవునికి వ్యతిరేఖముగా మాట్లాడినట్లగును కదా! అటువంటివాడు ఆకాశము నుండి క్రింద పడినట్లగునని కూడా వాక్యములో చెప్పాడు. అటువంటివారు దేవునిమీద ఎంత నమ్మకముతోయున్నా

ఉన్నత స్థితినుండి నీచస్థితికి వచ్చినట్లేనని హెచ్చరించుచూ, ఆకాశమునుండి క్రిందపడిన వానితో సమానము అని చెప్పడమైనది. దేవుడే స్వయముగా తన చిహ్నమును ప్రకటించి, దానిని గౌరవించినవాడే నిజమైన భక్తి మార్గములో ఉన్నట్లు అని చెప్పాడు. దానిని గౌరవించనివాడు ఎంత గొప్ప జ్ఞాని అయినా వాడు క్రిందికి దిగజారిపోయినట్లేయగునని కూడా చెప్పాడు.

**ప్రశ్న :-** దేవుని గుర్తును దేవుడే ప్రకటించాడని అంటారా?

**జవాబు :-** అంతిమ దైవగ్రంథములో సూరా 5 ఆయత్ 2లో, సూరా 22 ఆయత్ 32లో రెండుమార్లు స్వయముగా దేవుడే తన చిహ్నమును గురించి చెప్పి, దానిని గౌరవించితే వాడు నిజమైన నా భక్తుడే అని చెప్పియుండగా ఇంకా అనుమానమెందుకు? దేవుని చిహ్నమును దేవుడే చెప్పాడుగానీ మనుషులు ఎవరూ చెప్పలేదు. దేవుడు చెప్పిన తర్వాత దేవుని చిహ్నము ఏదో తెలియక కొందరు స్వయముగా ఇవే దేవుని చిహ్నములని నిర్ణయించు కొన్నారు. దేవుని గుర్తును దేవుడే నిర్ణయించాడు తప్ప మనుషులెవరూ నిర్ణయించలేదు. మనుషులు నిర్ణయించినవి దేవుని చిహ్నములు కావు. మనుషులు నిర్ణయించిన వాటికి దైవశక్తియుండదు. దేవుడు నిర్ణయించిన చిహ్నము ఇహలోక సంబంధమైనది కావు. అది దైవజ్ఞానముతో కూడుకొన్నదై దైవశక్తితో కూడుకొన్నదై వుండును. దేవుడు క్షమాశీలుడు. దేవున్ని ఆశ్రయించిన మనుషుల పాపములను దేవుడు క్షమించగలడు. అదే విధముగా **దేవుని శక్తితో కూడుకొన్న దేవుని చిహ్నము కూడా పాపములను క్షమించు (హరించు) శక్తిగలదై ఉండును.**

**ప్రశ్న :-** 'దేవుని చిహ్నము' అని మీరు ఏక వచనములో చెప్పుచున్నారు. ఖురాన్ గ్రంథములో రెండుచోట్ల 'దేవుని చిహ్నాలు' అని బహువచనములో

చెప్పబడియున్నది. వాస్తవానికి ఏది నిజము. దేవుని చిహ్నము బహు వచనమా? ఏకవచనమా?

**జవాబు :-** రాజముద్ర రాజుయొక్క శాసనములతో కూడుకొనివుండును. అలాగే దేవునియొక్క చిహ్నము దేవుని యొక్క ధర్మములతో కూడుకొని యుండును. దేవుని చిహ్నము ముఖ్యమైన నాలుగు ధర్మములతో కూడుకొని ఉన్నది. నాలుగు ధర్మములతో కూడుకొనియుండుట వలన దేవుని చిహ్నాలు అని గ్రంథములో చెప్పడమైనది. నాలుగు ధర్మములతో కూడుకొని ఏకముగా ఉండుట వలన మేము 'చిహ్నము' అన్నాము. దేవుని ధర్మములు ఎన్నియున్నా దేవుడు ఒక్కడే కావున దేవున్ని ఏకవచనములోనే చెప్పుచున్నాము. ధర్మముల ప్రకారము చెప్పితే దేవుడు బహువచనముగా కనిపించును. ఉదాహరణకు దేవున్ని "అజోపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోపిసన్, ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవా ఆత్మ మాయయా" అని సంస్కృత శ్లోకమును, భగవద్గీతలో జ్ఞానయోగము ఆరవ శ్లోకమున చెప్పడమైనది. ఈ శ్లోకములో దేవున్ని గురించి నాలుగు సూత్రములను చెప్పియున్నారు. ఒకటి దేవుడు పుట్టుక లేనివాడు, రెండు దేవుడు చావు లేనివాడు, మూడు సర్వజీవరాసులకు అధిపతిని (దేవున్ని), నాలుగు ప్రకృతిని నా ఆధీనములో పెట్టుకొన్నవాడిని. ఈ విధముగా ఈ శ్లోకములో దేవుడు నాలుగు ధర్మాలుగా చెప్పబడినాడు. అట్లని దేవున్ని నాలుగుగా ఉన్నవాడు అని మనము బహువచనములో చెప్పలేదు కదా! దేవుడు నాలుగు ధర్మాలతో కూడుకొని యున్నా ఏకముగా ఉన్నాడు. కావున దేవున్ని బహువచనములో చెప్పక ఏకవచనములోనే చెప్పుచున్నాము. అదే విధముగా దేవుని చిహ్నము దేవుని శక్తిని సూచించునదై నాలుగు ధర్మములతో కూడుకొనియున్నా చిహ్నమని ఏకవచనములో చెప్పుచున్నాము. దేవుని చిహ్నము ప్రజలకు అర్థమవుటకు అక్కడక్కడ

బహువచనములో చెప్పినా చెప్పవచ్చును. పై శ్లోకములో ఒకే దేవున్ని నాలుగు రకముల బహువచనములో ధర్మములు కలవాడు అనినా, చివరకు ఆయన అందరికీ దేవుడు అని చెప్పాము కదా! అదే విధముగా విడదీసి చెప్పితే దేవుని చిహ్నము నాలుగు ధర్మములతో కూడుకొని, నాలుగు భాగములుగా బహువచనముగా ఉన్నది. దేవుడు అనేక ధర్మములతో కూడుకొనియున్నా "ఏకం బ్రహ్మ" అని ('ఒక్కడే దేవుడు' అని) చెప్పినట్లు దేవుని చిహ్నమును కూడా రెండు విధముల చెప్పవచ్చును. అర్థము కాని వానికి క్రొత్తగా వినువానికి బహువచనముగా చెప్పాలి, అర్థమయిన వానికి ఏకవచనములో చెప్పాలి. అందువలన మీ ప్రశ్నకు ఒక విధముగా బహు వచనము సరిపోవును, మరొక విధముగా ఏకవచనము సరిపోవును.

**ప్రశ్న :-** ప్రస్తుత కాలములో మూడు నిలువు నామములనుగానీ, మూడు అడ్డనామములనుగానీ లేక నుదుటి భాగములో బొట్టును పెట్టుకొన్న వారినిగాని చూచి హిందువులని ఆ గుర్తులను బట్టి చెప్పుచున్నాము. ఇంతవరకు మతాల చిహ్నాలు (గుర్తులు) విన్నాముగానీ, దేవుని గుర్తు అనడము మేము క్రొత్తగా వింటున్నాము. భూమిమీద ఎవరయినా ఎక్కడయినా దేవుని చిహ్నమును గురించి చెప్పుకొనువారున్నారా?

**జవాబు :-** దేవుడు 5000 సంవత్సరముల పూర్వమే కలియుగము ప్రారంభములోనే భగవద్గీతా జ్ఞానమును చెప్పినప్పుడే అందులో దేవుని చిహ్నమును గురించి చెప్పడమైనది. తర్వాత బైబిలు, ఖురాన్ గ్రంథములలో కూడా ఆ విషయమును గురించి చెప్పడము జరిగినది. అయితే మనుషులు దేవుడు చెప్పిన విషయమును గ్రహించక తమ ఇష్టమొచ్చినట్లు దేవుని చిహ్నమును ఊహించుకోవడము జరిగినది. ఏదయినా నిర్ణయానికి

వచ్చునప్పుడు దేవుడు చెప్పిన గ్రంథమును ప్రమాణముగా తీసుకొని నిర్ణయించుకోవలసియుండును. దైవ గ్రంథ ఆధారములేకుండా దేవుని విషయములను నిర్ణయించకూడదు. అలా నిర్ణయించుకోవడము వలన మనిషి దేవుని మార్గమును వదలి, తప్పుదారి అయిన అజ్ఞాన మార్గములో పోవలసివచ్చును. దేవుడు తన గ్రంథములో తన చిహ్నమును గురించిన జ్ఞానమును ఇమడ్చుడమేకాక, అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో నా చిహ్నమును గౌరవించండి అని కూడా చెప్పాడు. అయితే ప్రస్తుత కాలములో దేవుని చిహ్నము అంటే ఏమిటో చాలామందికి తెలియకుండా పోయింది.

సృష్ట్యాదినుండి ఒకే జ్ఞానముండేది. కలియుగము వరకు మతముల సమస్యేలేదు. కలియుగములో మతములు వాటి పేర్లు బయటికి వచ్చాయి. సృష్ట్యాదిలోనే ఆకాశవాణి ద్వారా జ్ఞానము చెప్పబడినది. దేవుడు తన చివరి గ్రంథములో **'భూమిమీద మనుషులకు మూడు విధములుగా జ్ఞానమును తెలియజేతును'** అని చెప్పినట్లు, అందులో ఒక విధానమైన 'వాణి' ద్వారా తన జ్ఞానమును తెలుపుదును అను మాటను సృష్టి మొదటిలోనే నెరవేర్చాడు. ఆ విధముగా చెప్పిన జ్ఞానము గ్రంథరూపము కాలేదు. కృత, త్రైతా, ద్వాపర అను మూడు యుగముల పర్యంతము దేవుడు చెప్పిన జ్ఞానము శబ్దరూపముగానే ఉండేది. కలియుగము మొదటి వరకు అనగా ద్వాపరయుగము చివరివరకు దేవుడు ఆదిలో చెప్పిన జ్ఞానము మాటల రూపముగా, పాటల రూపముగా, పద్యముల రూపముగా, శ్లోకముల రూపముగా చెప్పుకొనెడివారు. గ్రంథరూపము కాని జ్ఞానము మూడు యుగములున్న తర్వాత ద్వాపరయుగము చివరిలో గ్రంథరూపమైనది. గ్రంథరూపమైన జ్ఞానమును తెలుగు భాషలో 'భగవద్గీత' అని అన్నాము. భారతదేశములో గ్రంథరూపమైన జ్ఞానము (భగవద్గీత) మొదట పదమాటి

దేశములవైపు ప్రాకినది. పడమటి దేశములలో భగవద్గీత, 'తౌరాత్' అని చెప్పబడినది. తౌరాత్ గ్రంథము మూసాకు ఇవ్వబడినదని తర్వాత ఆ దేశముల వారు చెప్పుకొనినా, ఆ మూసాయే కృష్ణుడని చాలామందికి తెలియదు.

సృష్ట్యాదిలో గ్రంథరూపముకాని జ్ఞానమునకు **"జపర"** అను ప్రత్యేకమైన పేరు ఉండేది. పుట్టునది అనుటకు 'జ' అనియు 'పర' అనగా వేరుగాయున్నదని అర్థము. పుట్టినదంతా దేవునికి వేరుగాయున్నది లేక సృష్ఠింపబడినదంతా దేవునికి పరముగా (వేరుగా) ఉన్నదని అర్థమొచ్చు నట్లు దేవుడు చెప్పిన జ్ఞానమునకు 'జపర' అని అర్థముతో కూడుకొన్న పేరు ఉండెడిది. గ్రంథరూపము కానప్పుడు భారతదేశములో (ఇందూ దేశములో) 'జపర' అను పేరుతోగల జ్ఞానము ఇతర పశ్చిమ దేశములలో **'జబూర్'** అను పేరుతో పిలిచెడివారు. మనదేశములో 'జపర' అనునదిగానీ, ఇతర దేశములలోగల 'జబూర' అను పేరుతోయున్నదిగానీ, రెండూ గ్రంథరూపము గా లేని జ్ఞానమని తెలియవలెను. చరిత్ర తెలియని కొందరు 'జబూర' అనునది కూడా ఒక గ్రంథమే అని అనుకోవడము జరిగినది. వాస్తవానికి జపర అనునదిగానీ, జబూర అనునదిగానీ గ్రంథరూపములో యున్నవి కావు. ఈ రెండు గ్రంథరూపములో లేని జ్ఞానము యొక్క పేర్లని తెలియవలెను. దేవుని జ్ఞానము మొదట భారతదేశములో గ్రంథరూపమైనది. వ్యాసుడు దేవుని జ్ఞానమును 'భగవద్గీత' అను పేరుతో వ్రాయగా, అదియే ఇతర దేశములలో 'తౌరాత్' అను పేరుతో చెప్పుకోబడినది. దైవజ్ఞానము గ్రంథ రూపము కాకుండా జపర అను పేరుతోయున్న రోజులలో జ్ఞానమును పాటల, పద్యముల, వచన రూపములో చెప్పుకొనెడివారు. ఆ కాలములోనే దేవుని జ్ఞానమును వారికి నచ్చిన పద్ధతిలో ఎదుటివారికి అర్థమయ్యేలాగున

చెప్పుకొనెడివారు. 'ఏడు మేడల చిన్నది కడు రమ్యముగ ఉన్నది' అనుమాట 'దేవుడు ఏడు ఆకాశముల మీద ఉన్నాడు' అనుమాట రెండూ ఒక్కటే. చెప్పే జ్ఞానము సూక్ష్మమైనదయినా దానికి ఒక రూపమును పోల్చి చెప్పెడి వారు. ఈ విధముగా పూర్వమే దేవుని జ్ఞానమును ఒక గుర్తుగా తెలిసి యుండెడి వారని, వారు చెప్పుకొన్న జ్ఞానమునుబట్టి తెలియుచున్నది. పూర్వము ఎంతో గొప్ప జ్ఞానులు, జ్ఞానసంపన్నులు ఉండెడివారు. అప్పటికే వారు దేవుని విషయమును జ్ఞానరూపముతో పూర్తిగా తెలిసినవారని తెలియు చున్నది. అటువంటి గొప్ప జ్ఞానులు గతించిపోగా, కలియుగము మొదటి కాలానికి భారతదేశమంతా అజ్ఞానముతో నిండిపోయినందున దేవుడు తిరిగి తన జ్ఞానమును ఇప్పటికి కలియుగములో మూడుమార్లు చెప్పించాడు. మూడుమార్లు చెప్పిన జ్ఞానమే మూడు దైవగ్రంథములుగా తయారైనవి. రెండుమార్లు "దూత" అను పేరుతో జ్ఞానమును **'భగవద్గీత, 'బైబిలు'**గా చెప్పించిన దేవుడు చివరికి మహాజ్ఞాని అయిన జిబ్రయేల్ అను గ్రహము చేత ముహమ్మద్ ప్రవక్త గారికి తన జ్ఞానమును చెప్పించాడు. అదియే **'ఖురాన్'** గ్రంథముగా వచ్చినది. **దేవుడు మొత్తము నాలుగుమార్లు జ్ఞానమును తన మూడు పద్ధతుల ద్వారా తెలియజేయగా, ఒకటి గ్రంథముకాని జ్ఞానముగా ఉండగా, మూడు గ్రంథములయిన జ్ఞానముగా ఉన్నవి. వాటి పేర్లనే వరుసగా జబూర్, తౌరాత్, ఇంజీల్, ఖురాన్ అని అంటున్నారు. తౌరాత్ (భగవద్గీత), ఇంజీలు (బైబిలు), ఖురాన్ అనునవి మూడు గ్రంథములుగా ఉండగా, జబూర్ అనునది ఏమాత్రము గ్రంథముకాదు.** "జపర" అను దైవజ్ఞానము పశ్చిమ దేశములలో 'జబూర' జ్ఞానముగా చెప్పబడినది. మొదట గ్రంథములేని సమయములో జపర లేక జబూర జ్ఞానముతోనే దేవుని చిహ్నమును పాటల రూపములో, పద్యముల రూపములో పోల్చి చెప్పారని తెలియుచున్నది.

**ప్రశ్న :-** జబూర్ అనునది ఒక గ్రంథమని కొందరు ముస్లీమ్‌లు చెప్పగా విన్నాము. మీరు గ్రంథము కాదు బోధ మాత్రమే అంటున్నారు. మీరు చెప్పేదానికి ఏమయినా ఆధారమున్నదా?

**జవాబు :-** ఆధారమున్నదనియే మేము చెప్పుచున్నాము. ఆధారము లేకుండా గ్రుడ్డిగా ఏదీ చెప్పము. అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో సూరా 21, ఆయత్ 105లో ఈ విధముగా ఉన్నది చూడండి (21.105) **"సజ్జనులైన నా దాసులే భూమికి వారసులవుతారని మేము జబూర్‌లో హితబోధ అనంతరము వ్రాసియున్నాము"** ఈ ఆయత్‌ను చూస్తే జబూర్ అనునది గ్రంథముకాదని హితబోధ మాత్రమేనని తెలియుచున్నది. జబూర్ హితబోధ తర్వాత దానినే మూడు దైవగ్రంథములలో వ్రాయడము జరిగినది. ఈ ఆయత్‌లోని విషయమును మేము చెప్పడమే కాకుండా, కొందరు ముస్లీమ్ పెద్దలు ఈ ఆయత్‌కు వ్రాసిన వివరములో కూడా ఈ విధముగా కలదు చూడండి. "జబూర్ అంటే అది గ్రంథము కావచ్చు లేక పూర్వపు దైవ గ్రంథాలలో మరేదైనా గ్రంథము కూడా కావచ్చు. ఈ ఆయత్‌లో 'జిక్ర్' అను అరబ్బీ పదమును వాడడము జరిగింది. జిక్ర్ అనగా 'హితబోధ' అను అర్థము రాగలదు." ఈ మాటను చూచిన తర్వాత జబూర్ అనునది కేవలము హితబోధ మాత్రమేననీ, తర్వాత ఆ బోధ గ్రంథరూపమైనదని తెలియుచున్నది. గ్రంథరూపమైన తర్వాత ఆ గ్రంథమునకు వేరు వేరు పేర్లు పెట్టబడినవి. జబూర్ హితబోధగలవే ఆకాశగ్రంథములు అనబడు దైవగ్రంథములు. మూడు యుగములలో జపర (జబూర్) అను పేరుతో యున్న దైవబోధ లేక ఆకాశవాణి ద్వారా వచ్చిన బోధయే తర్వాత కలియుగములో మూడు దైవగ్రంథములుగా వచ్చింది. ఇదంతయు తెలిసిన తర్వాత జబూర్ అనునది దైవబోధయేననీ, అదియే చివరకు దైవ గ్రంథములుగా తయారైనదని తెలియగలదు.

**ప్రశ్న :-** ప్రస్తుత కాలములో 'జబూర్' బోధ 'తౌరాత్' గ్రంథమయినదనీ, తౌరాత్ (భగవద్గీత) లోని జ్ఞానమే మిగతా ఇంజీలు (బైబిలు) ఖురాన్ గ్రంథములకు ఆధారమైనదనీ, ఈ మూడు గ్రంథముల జ్ఞానములో దేవుని చిహ్నము ఇమిడియున్నదని ఎవరికయినా తెలుసునా?

**జవాబు :-** దైవగ్రంథములలో దైవజ్ఞానము కలదు. దైవజ్ఞానము అందరికీ సులభముగా అర్థమవునది కాదు. మనిషికి ఎంతో శ్రద్ధ, బుద్ధియున్నప్పుడే వాడు దేవునికి ఇష్టుడగును. దేవునికి ఇష్టుడయిన వానికే దేవుని కరుణ వలన దేవుని జ్ఞానము అర్థము కాగలదు. అయితే నేడు మనిషి తనకు తెలిసినదే జ్ఞానమనుకొంటున్నాడు. దైవగ్రంథములోని జ్ఞానమును తప్పుగా అర్థము చేసుకొని, తనకు తెలిసినదే నిజమైన జ్ఞానమని అనుకొంటున్నాడు. ఎక్కడయినా దేవుడే పరోక్షముగా నీది పొరపాటు, 'అసలు జ్ఞానము' ఇది అని చెప్పినా, చెప్పేవాని గొప్పతనము తెలియక, దేవున్నే 'నీకు తెలియదు' అని ధిక్కరించువారున్నారు. అందువలన దేవుని జ్ఞానము తెలియుట సులభమైన పనికాదు. దేవుడు ప్రత్యక్షముగా చెప్పినా, పరోక్షముగా చెప్పినా మనిషి వినే పరిస్థితిలో లేడు. ఆధారము లేకున్నా తనకు తెలిసిందే నిజ జ్ఞానమని అనుకొంటున్నాడు.

**ప్రశ్న :-** ఈ కాలములో దేవుని చిహ్నము అను మాటను ప్రత్యక్షముగా ఖురాన్ గ్రంథములో చూచాము. అయితే దేవుని చిహ్నమును గురించి ఎవరయినా ఎక్కడయినా ప్రస్తావించారా? ఎవరికయినా దీనిని గురించి తెలిసియున్నదా?

**జవాబు :-** ఖురాన్ గ్రంథములో దేవుని చిహ్నమును గురించి చదవకముందే, భగవద్గీత గ్రంథములోనూ, బైబిలు గ్రంథములోను గల జ్ఞానముతో దేవుని

చిహ్నము యొక్క వివరము మాకు కొంత తెలిసింది. అందువలన నేడు మతములకు అతీతముగా ఉన్నది దేవుని చిహ్నము అని చెప్పుచున్నాము. ఎదురుగా కనపడు మేము దేవుని చిహ్నమును గురించి చెప్పితే మీరు నమ్మకపోవచ్చును. అయితే మాముందర జరిగిన ప్రత్యక్ష విషయమును వింటే మీకు కొంత నమ్మకము కలుగవచ్చును. పోయిన గురుపౌర్ణమి 31-07-2015వ తేదీన జరిగింది. ఆ దినము ఒక ముస్లీమ్ మహిళ దేవుడు అన్ని మతములకు ఒక్కడేయని తెలిసి, ఆమె గురుపౌర్ణమి దినమున తన ఐదు సంవత్సరముల వయస్సుగల కుమారునికి కాషాయరంగు శేర్వానీ దుస్తులను ధరింపజేసి, తలమీద కాషాయరంగు టోపీని పెట్టి, గురువేషము వేసి కాషాయిరంగులో కనిపించునట్లు చేసి, ముఖము మీద మూడు నామములను పెట్టి, హిందూ గురువువలె తీర్చిదిద్దినది. అతని వేషము గురుపౌర్ణమి రోజున వేసిన దానివలన ఆ అబ్బాయిని తెచ్చి మాకు చూపడము జరిగింది. ఆ వేషము చూచే దానికి బాగుంది. అయితే ముఖము మీద పెట్టిన నామమును చూచి అతనిని ఒక మతమునకు పరిమితి చేసినట్లయినది. గురువు అనగా అతను ఒక మతమునకు సంబంధించి ఉండకూడదు. అందువలన వెంటనే ఆ అబ్బాయి తండ్రి షఫీతో "మీరు గురువేషము వేసి నాకు చూపించారు. గురువు ఏ ఒక్క మతమునకు సంబంధించిన వాడుగా ఉండడు. గురువు దేవుని భావములు కల్గి దైవత్వముతో కూడుకొని ఉంటాడు. అందువలన ప్రపంచమంతటికీ నిజమైన గురువు, దేవుడు ఒక్కడే. ఇదే విషయమే ద్వితీయ దైవ గ్రంథములో మత్తయి 23వ అధ్యాయము 10వ వాక్యములో **"గురువు అని పేరుపెట్టి పిలువవద్దు మీ గురువు పరలోకమందున్న వాడే (దేవుడే)"** అని చెప్పబడి నది. దీనినిబట్టి దేవుడు ఒక మతమునకు సంబంధించినవాడు కాదు.

ఆయన సమస్త ప్రజలకు సంబంధించినవాడని తెలియుచున్నది. ఇప్పుడు మీరు వేసిన గురువు యొక్క అలంకారములో త్రినామమును నొసలు మీద ధరించడము వలన, దానినిబట్టి ఇతను హిందువుల గురువు అని చెప్పుటకు వీలున్నది. అందువలన ఇది దేవుడు చెప్పిన గురువేషధారణ కాకుండా ఒక మతమునకు సంబంధించిన వేషధారణయగును. ఒక మతమునకు సంబంధించిన వేషధారణ కాకుండా అన్ని మతముల గురువువలె ఉండుటకు, ముఖము మీద మత గుర్తును తీసివేసి, దేవుని గుర్తును ధరించమని చెప్పుచున్నాను" అని చెప్పాము. అప్పుడు ముస్లీమ్ అయిన ఆ బాలుని తండ్రి "దేవుని గుర్తు అంటే ఏమిటి?" అని అడిగాడు. అప్పుడు మేము "ముస్లీమ్‌లందరూ మాది అని చెప్పు ఖురాన్ గ్రంథములో 22వ సూరా 32వ ఆయత్‌నందు చెప్పియున్నదే దేవుని గుర్తు" అని చెప్పాము. అప్పుడు అతను ముస్లీమ్ పెద్దల వద్దకు పోయి ఖురాన్‌లో చెప్పిన దేవుని గుర్తును గురించి అడిగాడు. అప్పుడు వారి పెద్దలు ఈ విధముగా చెప్పారు.

"షఆయిర్ అంటే గుర్తులు లేక చిహ్నాలు అని అర్థము. సంకేతము అనికూడా ఒక అర్థము వస్తుంది. యుద్ధాలలో సైనికచర్యల కొరకు కూడా కొన్ని సంకేత పదాలను ఉపయోగిస్తారు. ఆ కోడ్‌ను సంబంధిత వ్యక్తులు మాత్రమే గుర్తించగలుగుతారు. అలాగే దేవుని చిహ్నాలు అంటే ఇస్లామ్ ధర్మవైశిష్ట్యాన్ని, ప్రత్యేకతను చాటి చెప్పే ఆదేశాలు అన్నమాట. వాటిద్వారా ఒక ముస్లీమ్ ప్రపంచములో తన వ్యక్తిత్వాన్ని, వైశిష్ట్యాన్ని చాటి చెపుతాడు. ఇతర మతాలనుండి ఆ చిహ్నాలు అతన్ని స్పష్టముగా వేరుపరుస్తాయి. మక్కాలోని సఫా, మర్వా పర్వతాలు కూడా దేవుని చిహ్నాలుగా ఖరారు చేయబడ్డాయి. ఎందుకంటే ముస్లీమ్‌లు హజ్, ఉమ్రాల సందర్భముగా ఈ రెండు కొండల మధ్య 'సయీ' చేస్తారు. ఈ ఆయత్‌లో హజ్‌లోని

ఇతర క్రియలు కూడా దైవచిహ్నాలుగా చేయబడ్డాయి. ముఖ్యముగా ఖుర్బాని పశువులు దైవచిహ్నాలుగా అభివర్ణించబడినాయి. వాటిని గౌరవించడమంటే బలిష్టమైన ఏ లోపము లేకుండా వున్న పశువులను ఖుర్బాని ఇవ్వటము. ఈ త్యాగము (ఖుర్బాని) భయభక్తులకు ఆనవాలుగా చెప్పబడింది" ఇలా చెప్పిన విషయమంతా వినిన వ్యక్తి తిరిగి మా వద్దకు వచ్చి ఈ విధముగా మమ్ములను అడిగాడు.

"మీరు దేవుని చిహ్నమును ముఖము మీద ధరించండి. దేవుని గుర్తును ధరించడము వలన ఒక మతమునకు సంబంధించిన వానిగా కాకుండా అన్ని మతములకు సంబంధించినవానిగా కనిపిస్తావు అని చెప్పారు. మా పెద్దల వద్దకు పోయి దేవుని గుర్తును అడిగితే ముఖము మీద ధరించుకొనే దానికి వీలులేకుండా మక్కాలోని కొండలను, దేవుని పేరుమీద వదలిన పశువులను చిహ్నములుగా చెప్పుచున్నారు. మా ముఖము మీద పశువులను, పర్వతాలను ఎలా పెట్టుకోవాలి? దేవుని గుర్తు ఒక మతమును సూచించదు దేవున్నే సూచిస్తుంది అని చెప్పారు. మా పెద్దలు అల్లా చిహ్నములు అన్ని మతములలో ముస్లీమ్‌ను గుర్తుపట్టునట్లు చేయును అని చెప్పారు. మీరు చెప్పేది దైవికముగా ఉంది. మావారు చెప్పేది ఇస్లామ్ మతమునకు సంబంధించినదిగానే ఉన్నది. అల్లా ఖురాన్ గ్రంథములో దేవుని చిహ్నములు పలానా పశువులనుగానీ, పలానా పర్వతములనిగానీ చెప్పలేదు. దేవుడు 'నా చిహ్నాలు' అని పేరుపెట్టి వదలివేశాడు. మావారేమో పర్వతాలు, పశువులు అంటున్నారు. పైగా బలిసిన పశువులను సమర్పించితే దేవుని గుర్తును గౌరవించినట్లని చెప్పు చున్నారు. దీనినిబట్టి బలహీనముగానున్న పశువులను సమర్పించితే దేవుని చిహ్నమును అగౌరవపరచినట్లేయని అర్థమగుచున్నది. ఇదంతా విన్న

తర్వాత దేవుని మీదవున్న భక్తి కాస్తా లేకుండా పోయేటట్లున్నది. దేవుని చిహ్న గౌరవానికి బలిసిన పశువులకు ఏమి సంబంధము? దీనినిబట్టి దేవునికి కూడా మనుషులకు ఇష్టమైనట్లే బలమైన పశువులంటే ఇష్టమని అర్థమగుచున్నది. ఇలా చెప్పుట వలన దేవుని మీద భక్తి పెరుగదుగానీ, ఉన్నది కూడా పోయేటట్లున్నది. మా విషయమును ప్రక్కనుంచి మీరు దేవుని చిహ్నమును గురించి ఏమి చెప్పెదరు?

**ప్రశ్న :-** ప్రత్యక్షముగా జరిగిన సంఘటన గురించి చెప్పారు. అటు పోయి ఇటు పోయి దేవుని చిహ్నము అంటే ఏమిటో మీరే చెప్పవలసి వచ్చింది. షఫీ అనే వ్యక్తి వారి పెద్దలు చెప్పిన మాటలను మీకు చెప్పాడు. అంతేకాక ఆయనకు వచ్చిన అనుమానములను కూడా వ్యక్త పరిచాడు. ఇంతవరకు మమ్ములను దేవుని చిహ్నము విషయములో ఊరిస్తూ వచ్చారు. అయినా ఇదే దేవుని చిహ్నమని మీరు కూడా చెప్పలేదు. ఇప్పుడు ప్రత్యక్షముగా జరిగిన సంఘటనలో షఫీగారు అడిగిన దానికి మీరు ఎటు తిరిగి జవాబు చెప్పవలసి వచ్చింది కదా! ఆయన అడిగినప్పుడు మీరు ఏమి సమాధానము చెప్పారో అతనికి చెప్పినదంతా మీరు చెప్పండి. మీరు ఏమి చెప్పారో తెలుసుకోవాలని మాకు కూడా ఉత్సాహముగా ఉన్నది.

**జవాబు :-** ఆకలికొన్నప్పుడు దొరికిన ఆహారము ఎంతో గొప్పగా కనిపించును. ఆకలి లేనప్పుడు మంచి ఆహారమున్నా దానిమీద ఆసక్తిని చూపరు. ప్రత్యక్ష సంఘటన జరిగి అందులో దేవుని గుర్తు ఏది? అని తెలుసుకొను ఆసక్తి కల్గుట వలన తెలియబడు విషయము మీద ఎవరికయినా శ్రద్ధవుండును. శ్రద్ధవున్నప్పుడే చెప్పినది బుర్రకెక్కును. అందువలన దేవుడు తన చిహ్నమును గురించి గురుపౌర్ణమి రోజు ప్రత్యక్ష సంఘటనగా వచ్చునట్లు చేశాడు. తన గుర్తు ప్రజలకు తెలియదను ఉద్దేశ్యముతో దేవుడే

అలా ప్రత్యక్ష సంఘటనగా తెచ్చి నాతో ఆయనే ఇలా చెప్పించాడు. ఆ సమయములో చెప్పేవాడిని నేను కాదని నాకు బాగా తెలుసు. నేను చెప్ప లేదని గ్రహించగలిగితే, చెప్పేదంతా నాలో నన్ను తోలేవాడు (నన్ను నడుపు వాడు) అని మీరు తెలియగలిగితే, చెప్పేది ఎవరో మీకే తెలిసిపోతుంది. చెప్పబడే విషయము (జ్ఞానము) పూర్తి సత్యమని కూడా అర్థమవుతుంది. అప్పుడు షఫీతో నేను మాట్లాడినట్లు పైకి కనిపించినా, లోపలనుండి ఎవరు చెప్పితే సత్యమో వారే మాట్లాడుచున్నారు.

"ఖురాన్ గ్రంథములో సూరా 2, ఆయత్ 29లో ఇలా కలదు. **(2-29) "దేవుడు మీకోసము భూమిలోయున్న సమస్త వస్తువులను సృష్టించాడు. తర్వాత ఆకాశమువైపుకు ధ్యాసను మరల్చి తగురీతిలో సప్తాకాశములను నిర్మించాడు, ఆయన అన్నీ తెలిసినవాడు"** అని కలదు కదా! తర్వాత సూరా 29, ఆయత్ 44లో ఇలా చెప్పాడు. **(29-44) "అల్లాహ్ ఆకాశాలనూ, భూమిని సత్యబద్ధముగా సృష్టించాడు. ఆకాశాలను, భూమిని పరమార్థముతో సృష్టించాడని తెలిసితే ఇందులో గొప్ప నిదర్శనము దొరుకుతుంది."** అని కలదు కదా! ఇక్కడ భక్తి శ్రద్ధలను కల్గి, బుద్ధిని ఉపయోగించి ఈ వాక్యములోని ప్రతి పదమును వివరముగా చూడగలిగితే ఇందులో గొప్ప **నిదర్శనము** కలదని చెప్పారు. నిదర్శనము అను మాటను విడదీసి చూస్తే ఇలా అర్థము గలదు. దర్శనము అనగా కనిపించునది లేక తెలియబడునదని అర్థము. నిదర్శనము అను పదములో 'ని' యొక్క విశేషతను, ప్రత్యేకతను గమనిస్తే 'ని' యొక్క అర్థము లేదు, కాదు అని తెలియుచున్నది. నిదర్శనము అనగా ఏదయితే దృశ్యముగా, దర్శనముగా ఉన్నదో అది దృశ్యరూపములో తెలియకుండా, ఏదయితే దర్శనముగా (కనిపించునదిగా) ఉన్నదో అది తెలియకుండా అణిగి ఉండడమును

నిదర్శనము అంటున్నాము. పై ఆయత్‌లో ఏదయితే మనిషికి కనిపించ వలయునో, తెలియవలయునో అది కనిపించక, లేక తెలియక అందులో ఇమిడి ఉన్నదని తెలియుచున్నది. అందువలన (29-44) వాక్యము చివరిలో తెలిసితే ఇందులో గొప్ప నిదర్శనము దొరుకుతుంది అని చెప్పారు. కనిపించనిది లేక తెలియనిది దొరుకుతుందని వాక్యము చివరిలో చెప్పాడు. పై రెండు వాక్యములలో దేవుడు భూమిని, ఆకాశమును సృష్ఠించాడని కలదు. అయితే కొందరు ఇందులో ఏమి రహస్యమున్నది. కనిపించే భూమిని, కనిపించే ఆకాశమునే కదా! సృష్ఠించినది. ఇందులో కనిపించని విషయమేముంది? తెలియని జ్ఞానము ఏముంది? అని అనుకోవచ్చును. మనకు తెలియని రహస్యమున్నదనే ఉద్దేశ్యముతోనే తెలియగలిగితే ఇందులో గొప్ప నిదర్శనము కలదని చెప్పాడు.

వాక్యములో అల్లాహ్ భూమిని, ఆకాశమును **సత్యబద్ధముగా** సృష్ఠించాడని చెప్పాడు. అంతేకాక ఆకాశమును, భూమిని **పరమార్థముతో** సృష్ఠించాడని కూడా చెప్పాడు. పరమార్థము అనగా నీకు తెలిసిన అర్థము కంటే వేరు అర్థముతో అని తెలియుచున్నది. పర అనగా వేరు అనియూ, పరమార్థము అనగా నీ అర్థముకంటే వేరుగానున్నదని అర్థము. దీని ప్రకారము దేవుడు భూమి, ఆకాశమును సృష్ఠించాడు అని అంటే అవి రెండు మనకు అర్థమయిన, మనకు కనిపించు భూమి, ఆకాశముకాదని తెలియుచున్నది. భూమి, ఆకాశము అంటే మనకు కనిపించునవి అని అనుకుంటే ఈ వాక్యములో **పరమార్థము** లేదు, **నిదర్శనము** లేదు. ఆయత్‌లో దేవుడు చెప్పినట్లు పరమార్థము, నిదర్శనము ఉన్నట్లయితే అవి మనకు కనిపించేవి తెలియబడేవి అయిన ఆకాశము కాదు, భూమికాదు. అయితే పరమార్థము ప్రకారము, నిదర్శనము ప్రకారము సత్యబద్ధముగా

భూమి, ఆకాశములు అంటే ఏమిటి? అని ఈ ఆయత్‌లు చదువు ప్రతి ఒక్కరూ ఆలోచించవలసిందే. దేవుడు తన అంతిమ దైవగ్రంథములో సూరా 3, ఆయత్ 7లో ఈ విధముగా చెప్పాడు.

**“నిజానికి ముతషాబిహాత్ (సూక్ష్మవాక్యముల) వాస్తవ అర్థము దేవునికి తప్ప మరి ఇతర మానవులకు ఎవరికీ తెలియదు. అయితే జ్ఞానములో పరిపక్వత చెందినవారు మేము వీటిని నమ్ముచున్నాము. ఇవన్నియూ దేవుని వద్దనుండి వచ్చిన వాక్యములే అంటారు. బుద్ధి, శ్రద్ధ యున్నవాడు మాత్రమే దేవుని జ్ఞానమును గ్రహించగలుగుతాడు”** అని కలదు. పైన చెప్పిన భూమి, ఆకాశముల విషయము సూక్ష్మజ్ఞానముతో కూడుకొని యున్నది. అందువలన **పరమార్థము, నిదర్శనము, సత్యబద్ధముగా** సృష్టించాడు అని చెప్పియున్నాడు. బుద్ధి శ్రద్ధయున్నవారు మాత్రమే దేవుడు చెప్పిన సూక్ష్మ విషయములను గ్రహించగలరు. బుద్ధిగానీ, శ్రద్ధగానీ లేనివారు సూక్ష్మ విషయములన్నీ భూటకములనీ, ఇతరులు తమను మభ్యపెట్టుటకు చెప్పుచుందురనీ, వారి మాటలను నమ్మకూడదని చెప్పుచుందురు. దేవుడు **“నేను అనుకొంటే మనిషిని దైవమార్గములో పంపుతాను, అట్లే నేను అనుకొంటే మనిషిని అజ్ఞాన మార్గములో కూడా పంపుతాను”** అని ఖురాన్ గ్రంథములోనే అనేకమార్లు చెప్పాడు. ఇక్కడ కూడా మనిషిని అయోమయము చేసి కొందరిని తప్పుదారి పట్టునట్లు చేయుటకు (3-7) ఆయత్‌లోనే రెండు రకముల చెప్పాడు. సూక్ష్మ, స్థూల జ్ఞానమున్నదని వాక్యములో చెప్పుచూ, సూక్ష్మ జ్ఞానమును తీసుకొని చాలామంది బోధకులు ఇతరులను తప్పు దారి పట్టించుచున్నారు అని చెప్పుట వలన, ఆ మాటనే ఆసరాగా తీసుకొని

సూక్ష్మజ్ఞానమును దేవుడే దిగివచ్చి చెప్పినా నమ్మనివారిగా మనుషులు తయారయినారు. చాలామంది ముస్లీమ్‌లు ముతషాబిహాత్ (సూక్ష్మజ్ఞాన) వాక్యములను ఏమాత్రము నమ్మనివారుగా తయారైనారు. ముతషాబిహాత్ వాక్యములను ఎవరు చెప్పినా వాటిని నమ్మకూడదని నిర్ణయించుకొన్నారు. దేవుడు ఆ వాక్యముల జ్ఞానము తనకే తెలుసునని ఏ మానవునికీ తెలియదని చెప్పినమాట వాస్తవమే. అయితే అదే వాక్యములో చివరన బుద్ధి శ్రద్ధయున్న వారు తన సూక్ష్మజ్ఞానమును గ్రహింతురని కూడా చెప్పాడు. ఈ వాక్యము అర్థమయిన వారు దేవుడు చెప్పిన నిదర్శన వాక్యములను తెలుసుకోగలుగు చున్నారు, అర్థము చేసుకోగలుగుచున్నారు.

దేవుడు మనిషికి రెండుమార్గములను చూపి, ఎటు పంపవలసిన వానిని అటే పంపుచున్నాడు. దేవుని సూక్ష్మతను గ్రహించుకోలేని వారందరూ అజ్ఞానమార్గములో పోవుచూ, సరియైన సత్యమైన జ్ఞానమును చెప్పువారిని కూడా హేళనగా మాట్లాడుచూ, అజ్ఞాన మార్గములోయున్న తాము సరియైన మార్గములో ఉన్నారని తలచుచూ, అసలయిన జ్ఞానమార్గములో యున్న వారిని అజ్ఞానమార్గములో ఉన్నట్లు తలచుచున్నారు. ఇటువంటి విధానము చాలామంది ముస్లీమ్‌లలో ఉందని చెప్పవచ్చును. అందువలన ప్రతి విషయములోనూ మేము చెప్పునది సరియైన జ్ఞానము కాదని మాతో వాదించుచున్నారు. అయినా వారు మార్గము చెడినవారని మాకు బాగా అర్థమయినది. వారి విషయము దేవుడే చూచుకొంటాడు. నేను మాత్రము దేవుడు పలికించిన దానిని చెప్పుచున్నాను. అట్లే దేవుడు వ్రాయించిన దానిని వ్రాయుచున్నాము. దేవుని జ్ఞానము దేవుడే చెప్పాలిగానీ నేను చెప్పుటకు అనర్హుడను. అయితే నేను తెలిసి ఏమీ చెప్పకున్నా, నానుండి ఎన్నో జ్ఞాన రహస్యములను దేవుడే పలికించుచున్నాడు. నేను కనిపించే బొమ్మను మాత్రమే. ఆడించే సూత్రధారి లోపలవుండి మాట్లాడించు

చున్నాడు, వ్రాయించుచున్నాడు. అందువలన పైకి కనిపించు నేను చెప్పునది ఏమనగా! ఈ వ్రాత నాదికాదు, ఈ బోధ నాదికాదు. చెప్పేవాడు అన్నీ తెలిసిన ఆత్మేననీ, ఆయనకు తెలియనిది ఏదీ లేదని, అందరిలో పర్యవేక్ష కునిగా ఉన్న అతనే అందరినీ ఆడించుచున్నాడని చెప్పగలము. ప్రతి మనిషి ఒక పర్యవేక్షకుడు కలిగియున్నాడు. ఇదే విషయమునే అంతిమ దైవ గ్రంథము ఖురాన్‌లో 86వ సూరా, 4వ ఆయత్‌యందు ఇలా చెప్పారు. **(86-4) "తనను కనిపెట్టుకొని ఉండేవాడు లేకుండా ఏ ప్రాణి లేదు."** ఈ మాటలో కనిపెట్టుకొనియున్న వాడే ప్రతి మనిషిని నియమబద్ధముగా ఆడించు చున్నాడు. మనిషి గతములో చేసుకొన్న పాపపుణ్యములు కర్మపత్రము అను గ్రంథములో లిఖించబడియుండును. అట్లు లిఖించబడిన కర్మపత్రము ప్రకారము మనిషి శరీరములోనున్న రెండవ వాడే (ఆత్మయే) అతనికి కాపలాగా పర్యవేక్షకునిగా, ఆడించే వానిగానున్నాడు ప్రతి విషయము లోను కర్మను అనుసరించి నడుపుచుండును. అట్లు శరీరములోవుండి శరీరములో గల జీవాత్మను నడుపువాడు ఆత్మ అనబడు వాడని మిగతా రెండు గ్రంథములలో చెప్పబడినది. నాలో కూడా ఆత్మ అనువాడు నన్ను నడుపుచున్నాడని నాకు స్పష్టముగా తెలుసు. అందువలన నా ప్రతి కదలిక, ప్రతి మాట, ప్రతి పని నాదికాదు నన్ను నడిపించు ఆత్మ చేయునదే అని చెప్పుచున్నాము. నా ఒక్కని విషయమే కాదు, భూమిమీద పుట్టిన ప్రతి మనిషిని లోపలయుండి నడుపువాడు కలదు. అందువలన ఖురాన్‌లో 86-4వ వాక్యమునందు ప్రతి వానిలో వానిని కనిపెట్టుకొనివుండే వాడు కలడని చెప్పాడు.

**ప్రశ్న :-** మీరు మూడు మతములను గురించి ధారాళముగా చెప్పుచున్నారు. అట్లని మీరు చెప్పేవన్నీ నిజమేనా! అని అనుమానము కూడా కొంత కలదు. మీ మాట నమ్మమంటారా?

**జవాబు :-** చెప్పేది మాత్రము నా బాధ్యత, నమ్మేది లేనిది అది నీ ఇష్టము. నేను జ్ఞానమును జ్ఞాపకము చేయువాడను మాత్రమే, మీరు నేను చెప్పేదంతా నమ్మమని నేను చెప్పలేదు. నీకు ఇష్టమైతే నమ్ము, ఇష్టము కాకపోతే వదలివేయి. నిన్ను జ్ఞానిగా చేయవలసిన వాడు, అజ్ఞానిగా చేయవలసిన వాడు దేవుడే.

**ప్రశ్న :-** 29-44 మరియు 2-29 వాక్యములలో ఎంతో నిదర్శనము, పరమార్థమున్నదని వాక్యములో గలదు. అక్కడ చెప్పినది భూమి, ఆకాశములనే కదా! ఆ రెండు అందరికీ కనిపించునవే కదా! అందులో గొప్ప రహస్యముగానీ, నిదర్శనముగానీ, పరమార్థముగానీ మాకు ఏమీ కనిపించలేదే?

**జవాబు :-** గ్రంథము చదివే ప్రతివానికీ విషయము అర్థమైతే, చెప్పేవానితో పనేలేదు కదా! చెప్పేవాడు గురువు. ప్రతీదీ గురువు చెప్పవలసిందే మనిషి విని తెలుసుకోవలసిందే.

**ప్రశ్న :-** గురువు మనిషి కాదా?

**జవాబు :-** ప్రతివాడు మనిషే, అయితే అరుదుగా భూమిమీద ఎక్కడో ఒకచోట మనిషి వేషములో మనిషివలె గురువు కూడా ఉండును. గురువు అంటే దేవునియొక్క సాకారరూపమని చెప్పవచ్చును. నిరాకారముగా కనిపించకయున్నవాడు దేవుడు. దేవునియొక్క అంశ, దేవునియొక్క శక్తి భూమిమీద మనిషివలె పుట్టి, తన జ్ఞానమును గురించి తానే చెప్పవలసియున్నది. అలా పుట్టినవాడు చూచుటకు మనిషే అయినా అతను అందరివలె మనిషి కాదు. అతనిని ప్రత్యేకముగా వచ్చినవాడు అనిగానీ, భగవంతుడు అనిగానీ, గురువు అనిగానీ అనవలెను. గురువు అనినా,

భగవంతుడు అనినా, ఇద్దరూ ఒక్కటేయని తెలియవలెను. అటువంటివానిని మనిషిగా లెక్కించకూడదు. పైకి మనిషివలెయున్నా అతను అన్ని విషయములలో ప్రత్యేకముగా ఉండును. ఆయన ఎంతటి గొప్ప జ్ఞాన రహస్యమునయినా చెప్పగలడు. మనిషికి తెలియని జ్ఞానము గురువుకే తెలియును. అటువంటి వానినే బైబిలులో యోహాన్ సువార్తయందు **'ఆదరణ కర్త'** యని చెప్పారు.

**ప్రశ్న :-** మా ముస్లీమ్‌లు ముహమ్మద్ ప్రవక్తగారిని బైబిలులో ఏసు చెప్పిన ఆదరణకర్తగా చెప్పుచుండగా విన్నాను, మీరేమంటారు. ప్రవక్తగారు ఆదరణ కర్తే కదా! ఆయన గురువే కదా!

**జవాబు :-** ప్రవక్తగారిని మనము ఎలా పోల్చుకొన్నా తప్పులేదు. అయితే ఖురాన్ గ్రంథములో కొన్ని ఆయత్‌లలో ప్రవక్త ఎటువంటి మహత్యము లేనివాడనీ, ప్రవక్త ప్రజలను హెచ్చరించుటకు మాత్రము వచ్చినవాడనీ, ప్రవక్త ఏ జ్ఞానము తెలియని వాడనీ, జిబ్రయేల్ చెప్పిన జ్ఞానమును మనుషులకు చెప్పుటకు వచ్చిన ప్రవక్తయనీ, దేవుడు ముహమ్మద్ గారిని ఆఖరీప్రవక్తగా ఎన్నుకున్నాడని తెలియుచున్నది. ప్రవక్తగారు ఎంతో సాత్త్వికుడు, చదువురాకున్నా ఎంతో గొప్ప మేధావి.

ఎంతో సత్‌పురుషుడయిన ముహమ్మద్‌గారిని దేవుడు స్వీకరించి జిబ్రయేల్ ద్వారా జ్ఞానమును చెప్పించాడు. ప్రవక్తగారు జ్ఞానవిషయములో హెచ్చరించేవాడేనని ఖురాన్ గ్రంథములో చెప్పియుండుట వలన అంతకంటే ఎక్కువగా పోల్చుకోకూడదు. 'ఆదరణకర్త' అయినవాడు స్వయముగా జ్ఞానము చెప్పువాడుగా ఉండును. అందువలన గురువును ఆదరణకర్తయని అన వచ్చును.

**ప్రశ్న :-** ప్రవక్తగారు జిబ్రయేల్ చెప్పిన జ్ఞానమును అప్పటి వారికి చెప్పాడు. అదే జ్ఞానమే ఖురాన్ గ్రంథముగా నేడు మనముందరున్నది. అందులో 'సూక్ష్మమైన వాక్యములు కొన్ని, స్థూలమైన వాక్యములు కొన్ని ఉన్నాయి' అని చెప్పారు. అందులో ఏవి సూక్ష్మమైన వాక్యములు, ఏవి స్థూలమైన వాక్యములు అని గ్రహించవచ్చును?

**జవాబు :-** ఈ విషయము మేము **"అంతిమ దైవగ్రంథములో జ్ఞాన వాక్యములు"** అను గ్రంథములో వివరముగా వ్రాశాము. ఆ గ్రంథమును చదివితే మీకు స్థూల, సూక్ష్మ విషయములను గూర్చి పూర్తిగా అర్థము కాగలదు. అయినా ఉదాహరణగా కొంతమాత్రము చెప్పెదను వినుము. ఖురాన్ గ్రంథములో సూరా 2, ఆయత్ 187లో భార్యాభర్త కలయిక విషయమును చెప్పాడు. ఆరాధన దినములలోగానీ, ఖురాన్ అవతరించిన రంజాన్ నెలలోగానీ మీరు పవిత్రముగా ఉండవలెనని చెప్పుచూ భార్యా భర్తల కలయిక రాత్రిపూట మాత్రమే ఉండవలెనని పగలుపూట ఉండకూడదని చెప్పారు. ముహమ్మద్ ప్రవక్తగారు జిబ్రయేల్ చెప్పిన విషయమునే చెప్పాడు. అందులో ఎటుచూచినా స్థూల జ్ఞానమే కలదు. "రాత్రిపూట మీరు ఏమి అనుభవించినా ఫరవాలేదు పగలు పూట మాత్రము మేము చెప్పినట్లు ఉపవాసముండండి" అని చెప్పాడు. అయితే ఖురాన్‌లో ఉండే స్థూలవాక్యము కూడా మనుషులకు అర్థముకాలేదు. దేవుడు అక్కడ ఒకటి చెప్పియుంటే మనుషులు మరొకటి చేయుచున్నారు. ఈ విధముగా స్థూల విషయములే అర్థముకానప్పుడు సూక్ష్మవిషయములు ఎలా అర్థము కాగలవు. అందువలన గురువు లేక భగవంతుడు లేక ఆదరణకర్త వచ్చి వివరించి చెప్పేంతవరకు సూక్ష్మమైన విషయములు అర్థముకావు.

ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. 29-44వ వాక్యములో **(29-44) "అల్లాహ్ భూమిని, ఆకాశములను సత్యబద్ధముగా సృష్టించాడు. ఆకాశమును భూమిని పరమార్థముతో సృష్టించాడని తెలిసితే ఇందులో గొప్ప నిదర్శనము దొరుకుతుంది"** అని కలదు. అయితే ఇందులో 'భూమి, ఆకాశములను' అని అన్నప్పుడు భూమి ఆకాశము స్థూలమైన కంటికి కనిపించు విషయమే కదా! అని ఎవరయినా అనుకొను అవకాశము గలదు. అక్కడ చెప్పినది ఒక్క ఆకాశమునుగాదు **'ఆకాశములు'** అని చెప్పాడు. మనకు 'ఆకాశము' కనిపించుచున్నదిగానీ, 'ఆకాశములు' కనిపించలేదు. ఈ మాటతోనే ఇందులో కనిపించని జ్ఞానమున్నదని తెలిసిపోవుచున్నది. మనము బాగా ఆలోచిస్తే ఖురాన్ గ్రంథము తౌరాత్ గ్రంథము యొక్క ఆధారముతో చెప్పబడినది. ఆ విషయము ఖురాన్ గ్రంథములోనే కలదు. తౌరాత్ గ్రంథమును ఖురాన్ గ్రంథము ధృవీకరించుచున్నదని చెప్పినప్పుడే తౌరాత్ గ్రంథములోని జ్ఞానమే ఖురాన్‌లో కలదని తెలిసిపోవుచున్నది. తౌరాత్ గ్రంథములో చెప్పిన వాక్యములన్నియూ శరీర అంతరంగములోనే చెప్పడము జరిగినది. చివరికి దేవుడు మనిషి శరీరములో కూడా కలడని చెప్పడమైనది. అదే జ్ఞానమునే ఖురాన్‌లో చెప్పుట వలన ఖురాన్‌లోని ఆయత్‌లు శరీరములో దాగియున్న జ్ఞానమునే చెప్పాయని తెలియవచ్చును. భగవద్గీత ప్రకారమైనా, ఖురాన్ ప్రకారమైనా 29-44లో ఉండే జ్ఞానము సూక్ష్మమైనదనీ, శరీరములో దాగియున్న జ్ఞానమని తెలిసిపోవుచున్నది. 'భూమి, ఆకాశములను వాటి మధ్యలోయున్న సమస్తమును దేవుడు సృష్టించాడు' అనుట సత్యమే అయినా ముందు ఆకాశములను గురించి తెలుసుకోవాలి. ఆ ప్రయత్నములో ఖురాన్‌యందే సప్త ఆకాశములని చాలాచోట్ల చెప్పబడినది. దానినిబట్టి ఏడు ఆకాశములున్నాయనీ, ఏడు

ఆకాశములు బయట ప్రపంచములో లేవనీ, లోపలి ప్రపంచమయిన శరీరములోనే కలవని అర్థము చేసుకోవాలి. ఈ మాటకు మూలము భగవద్గీతయందుగల విభూతి యోగమను అధ్యాయమున ఆరవ శ్లోకములో కలదని తెలియుచున్నది. **"మహర్షయ సప్త"** అను పదమును తీసుకొని చూస్తే మన శరీరములోగల ఏడు ఆకాశముల వివరము తెలియగలదు.

సూరా 29-44వ ఆయత్ ప్రకారము ఏడు ఆకాశములు బయట ఎక్కడా లేవు. అయితే ఏడు ఆకాశములనబడు విధానము శరీరము లోపల యున్నది. శరీరములోపల తల మొదలుకొని గుదస్థానము వరకుగల వెన్నెముకలో వెన్నుపాము అనబడు పెద్ద నరము కలదు. వెన్నుపాము అనబడు పెద్దనరము మెదడునుండి బయలుదేరి వెన్నుపాములో వ్యాపించి నడుము క్రింద చివరిపూస వరకు ఉండును. అలా వ్యాపించిన నరము మొత్తము ఏడు భాగములుగా విభజింపబడియున్నది. వెన్నుపాము పై భాగమయిన మెదడు పెద్దనాడీకేంద్రముగా ఉన్నది. మిగతా ఆరు స్థానములలో వెన్నుపాము అనబడు నరమునందు మిగతా ఆరుచోట్ల ఆరు నాడీకేంద్రములు కలవు. మొత్తము వెన్నుపాము ఏడు నాడీకేంద్రములుగా విభజింపబడియున్నది. ఈ ఏడు నాడీకేంద్రముల ద్వారా శరీరములోని మొత్తము పనులు జరుగునట్లు ఏడు కేంద్రముల నుండి చిన్నచిన్న నరములు శరీరమంతా వ్యాపించియున్నవి. ఏడు నాడీ కేంద్రములలో ఆత్మశక్తి యుండగా ఏడవ కేంద్రమందు పరమాత్మ శక్తి (దేవుడు) నిలయమై యున్నాడు. ఈ విధముగా ఒక సజీవ శరీరములో ఏడు ఆకాశములనబడు ఏడు నాడీకేంద్రములు గలవు. ఈ ఏడు నాడీ కేంద్రములనే ఏడు ఆకాశములని ఖురాన్ గ్రంథములో అనేకమార్లు చెప్పబడినది. దీనిని డిజైన్ చేసినవాడు, తయారు చేసినవాడు అల్లానే (దేవుడే). అందువలన

(29-44) ఆయత్‌లో **"అల్లాహ్ ఆకాశములను భూమిని సత్యబద్ధముగా సృష్టించాడు"** అని చెప్పాడు. అదే వాక్యములోనే ఉన్న ఏడు ఆకాశములను కాక భూమి ఏమిటని యోచించితే, నాడీకేంద్రముల నుండి శక్తి ప్రవహించు శరీరమంతయూ భూమిగానే లెక్కించబడుచున్నది. శరీరమను భూమిని నాడీకేంద్రములను ఆకాశములను దేవుడు సృష్టించాడని నేరుగా చెప్పక, ఆకాశములను భూమిని అల్లాహ్ సృష్టించాడని అందులో నిదర్శనమున్నదని చాటుగా చెప్పాడు. భూమి ఏదయినదీ, ఆకాశములు ఏవయినవీ తెలియడమే **పరమార్థము** అన్నారు. శరీరములో ఎంతో గొప్పదైన జ్ఞానము ఇమిడియుండుట వలన **సత్యబద్ధముగా** తయారు చేశానని చెప్పాడు. శరీరములో ఆకాశములు భూమి కనిపించకయుండుట వలన **'నిదర్శనము'** అని కూడా చెప్పారు.

ఇప్పుడు తెలియబడు విషయమును గ్రహించలేకపోతే, అటువంటి వారు పరమార్థమును తెలియలేరు, నిదర్శనమునూ తెలియలేరు. దేవుడు ఈ విషయమును అనగా తన జ్ఞాన విషయమును ముందుగానే తెలియ జేస్తూ, ఖురాన్ గ్రంథములో సూక్ష్మ జ్ఞాన విషయములు కలవనీ, అటువంటి సూక్ష్మజ్ఞానము బుద్ధి, శ్రద్ధయున్న వారు మాత్రమే గ్రహించగలరని తెలిపి యున్నాడు. అంతేకాక సూక్ష్మ విషయముల జ్ఞానము దేవునికి తప్ప ఏ మానవునికీ తెలియదని ముందే చెప్పాడు. శరీరములో స్మృతి, జ్ఞానము, ఊహ దేవుని వలననే కల్గునని భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున 15వ శ్లోకమందు చెప్పియున్నాడు చూడండి.

శ్లో॥ *సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్ జ్ఞాన మపోహనంచ।*
*వేదైశ్చ సర్వైరహ మేవ వేద్యో వేదాంత కృద్వేదవి దేవ చాహమ్॥*

**భావము :- "నేను సఖల జీవరాసుల హృదయము అను బ్రహ్మనాడి లేక వెన్నుపాములో ఉన్నాను. నా వలననే స్మృతి, జ్ఞానము, ఊహ కల్గును. వేదంబులన్ని నన్నే తెలుపుచున్నవి. వేద ఫలదాతను కూడా నేనే"** అని దేవుడు తన శ్లోకములో చెప్పియున్నాడు. దీనినిబట్టి అవసరమొచ్చినప్పుడు మనిషి శరీరమునుండి దేవుడే తన జ్ఞానమును అందించునని తెలియుచున్నది. ఇప్పుడు కూడా దేవుడు నాకు అందించు జ్ఞానమునే మీకు చెప్పుచున్నాము. దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతర మానవులకు ఎవరికీ తెలియదని ఖురాన్ గ్రంథములో సూరా 3, ఆయత్ 7లో తెలియ జేశాడు. ఏ మానవమాత్రుని మీద నా జ్ఞానమును ప్రసరింపజేయలేదని సూరా 6, ఆయత్ 91లో కూడా తెలియజేశాడు. దేవుని జ్ఞానము దేవుడు తెలియజేస్తేనే మనుషులయిన మనకు తెలుస్తుంది. సూరా 29, ఆయత్ 44లో గల సమాచారము పూర్తి సూక్ష్మజ్ఞానముతో కూడుకొన్నదైయున్నది. ఇక్కడగల జ్ఞాన విషయము శరీర అంతర్భాగములలో కనిపించక ఉండుట వలన ఇది నిదర్శన జ్ఞానమని వాక్యములో చెప్పారు. కనపడు భూమి, ఆకాశముల కంటే వేరయిన అర్థముతో కూడుకొనియుండుట వలన పర+అర్థము=పరమార్థముతో కూడుకొనియున్నదని చెప్పారు.

పరమార్థము అనగా మీరు అనుకున్న అర్థము కాదనీ, స్పష్టముగా తెలిసిపోవుచున్నది. దానిప్రకారము మనము అనుకొన్న ఆకాశము కాదు, అలాగే మనము అనుకొన్న భూమి కాదు అని తెలిసిపోయినది. అదేదో మన శరీరములోని చిదంబర రహస్యమని తెలిసిపోయినది. చిదంబర రహస్యమను **"బట్టబయలు"**ను దృశ్యరూపముగా చూపించినట్లు మనము కూడా మన శరీరములోని దేవుడు చెప్పిన రహస్యమును ఉన్నది ఉన్నట్లు దృశ్యములాగా చిత్రించుకొని తర్వాత పేజీలో చూస్తాము.




**బ్రహ్మనాడి లేక వెన్నుపాము**

దేవుడు తన జ్ఞానములో మొదటిగా తన సృష్ఠిని గురించి చెప్పాడు. తర్వాత తన జ్ఞానమును చెప్పాడు. మొదట ఏడు ఆకాశములను ఎలా సృష్ఠించాడో నిదర్శన రూపముగా ఉన్న జ్ఞానమును దర్శనముగా చేసి చూచుకొన్నాము. సృష్ఠి తర్వాత ముఖ్యమైన జ్ఞానముగా చెప్పినది మూడు ఆత్మల విషయము. మూడు ఆత్మల విషయమును, మూడు దైవ గ్రంథము లలో చెప్పడమైనది. తౌరాత్ (భగవద్గీత) గ్రంథములో పురుషోత్తమ ప్రాప్తి యోగమున చెప్పిన మూడు ఆత్మల విషయమును మిగతా రెండు గ్రంథముల యందు కూడా చెప్పడము జరిగినది.

| | | | |
|---|---|---|---|
| **1)** | **క్షరుడు** | **అక్షరుడు** | **పురుషోత్తముడు** |
| | **(జీవాత్మ)** | **(ఆత్మ)** | **(పరమాత్మ)** |

**అను ముగ్గురు పురుషులయినవారు ప్రతి మనిషి శరీరములో గలరు.**

**(భగవద్గీతలో, పురుషోత్తమ ప్రాప్తి యోగము 16,17 శ్లోకములను చూడండి.)**

| | | | |
|---|---|---|---|
| **2)** | **కుమారుడు** | **తండ్రి** | **పరిశుద్ధాత్మ** |
| | **(జీవాత్మ)** | **(ఆత్మ)** | **(పరమాత్మ)** |

**అను ముగ్గురు తెలియనివారు ప్రతి మనిషి శరీరములో గలరు.**

**(బైబిలులో మత్తయి సువార్త 28వ అధ్యాయము 19,20 వాక్యములను చూడండి.)**

| | | | |
|---|---|---|---|
| **3)** | **తోలబడేవాడు** | **తోలేవాడు** | **సాక్షిగా చూచేవాడు** |
| | **(జీవాత్మ)** | **(ఆత్మ)** | **(పరమాత్మ)** |

**అను ముగ్గురు కనిపించనివారు ప్రతి మనిషి శరీరములో గలరు.**

**(అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో సూరా 50, ఆయత్ 21 ని చూడండి.)**

దేవుడు చెప్పిన జ్ఞానములో మొదటిది సృష్ఠికాగా, రెండవది సృష్ఠిలో యున్న మూడు ఆత్మల జ్ఞానము. మూడు ఆత్మల గురించి మూడు దైవ గ్రంథములలో చెప్పియున్నారు. తర్వాత ముఖ్యమైన జ్ఞానము మనుషులు చేసుకొన్న పాపపుణ్యములనబడు కర్మను గురించి తెలుసుకొను జ్ఞానము. కర్మను గురించి మూడు దైవగ్రంథములలో ఎంతో వివరణ ఇచ్చారు. కర్మ మనిషి శరీరములోనే పర్యవేక్షకుని చేత వ్రాయబడుచున్నదని అంతిమ దైవగ్రంథ మయిన ఖురాన్‌లో చెప్పారు. కర్మలిఖితమును 'కర్మపత్రమని' చెప్పడమేకాక కర్మ ఒక దివ్యగ్రంథమందు నమోదు చేయబడుచున్నదని కూడా చెప్పారు. కర్మను అనుభవించక ఎవరూ తప్పించుకోలేరని చెప్పడమేకాక, దేవుడు ఒక్కడే దానిని క్షమించు క్షమాశీలుడని కూడా చెప్పారు.

కర్మ మన శరీరములో ఎట్లున్నదీ, ఎక్కడున్నదీ రహస్య జ్ఞానముగా ఖురాన్ లోనూ, భగవద్గీతలోనూ చెప్పారు.

దేవుడు మొదట సృష్టిని గురించిన జ్ఞానము చెప్పాడు. తర్వాత మూడు ఆత్మలను గురించిన జ్ఞానము చెప్పాడు. ఆ తర్వాత జీవుడు కర్మచేత నడుపబడుచున్నాడని, కర్మలను గురించి జ్ఞానమును చెప్పాడు. చివరిగా ప్రతి కర్మకు, ప్రతి పనికి ఒక గడువు ఉన్నదనీ, ప్రతి గడువు కాలములో నిర్ణయించబడియున్నదని దేవుడు తన జ్ఞానములో చెప్పాడు. ఈ విధముగా దేవుని జ్ఞానమును నాలుగు ముఖ్యమైన పాయలుగా (భాగములు) గా చెప్పాడు. మూడు దైవగ్రంథములలో ఈ నాలుగు జ్ఞానములే ముఖ్యముగా చెప్పబడినవి. ఈ నాలుగు భాగముల జ్ఞానమును దర్శనముగా చేసుకో గలిగితే అదే దేవుని చిహ్నమగును. దేవుని జ్ఞానము అదృశ్యరూపములో పరమార్థముగా ఉన్నది. అటువంటి పరమార్థమును అర్థము చేసుకోగలిగితే, నిదర్శన జ్ఞానమును దర్శనరూపముగా చేసుకోగలిగితే, దర్శనమిచ్చునదే దేవుని చిహ్నమగును. దేవుని చిహ్నము అత్యంత శక్తివంతమైనది, అటువంటి దేవుని జ్ఞానమును ఎలా దృశ్యరూపమైన చిహ్నముగా (గుర్తుగా) చేసుకోవాలో ఇప్పుడు వివరించుకొందాము. దేవుడు మొదట భూమినీ, ఏడు ఆకాశము లను సృష్టించాడు దానిని దృశ్యరూపముగా చేసుకొన్నప్పుడు శరీరము భూమిగా, ఏడు ఆకాశములు శరీరములోగల శరీరమును నడుపు ఏడు నాడీ కేంద్రములుగా చెప్పుకొన్నాము. ఏడవ నాడీకేంద్రము పైన దేవుని సింహాసనమున్నట్లు, దేవుడు అక్కడ ఉన్నట్లు ఖురాన్ గ్రంథములో చెప్పారు. దానిని దృశ్యరూపములో చూచుకోమని చెప్పారు. అలా జ్ఞానదృష్టితో చూస్తే దేవుని సృష్టియందు ఏమయినా లోపముందో లేదో నీకే తెలుస్తుంది కదా! అన్నాడు. ఆ విషయమునే ఖురాన్ గ్రంథములో సూరా 67, ఆయత్

3లో **(67-3) "ఆయన ఏడు ఆకాశములను ఒకదానిపై ఒకటి నిర్మించాడు. నీవు ఎటు చూచినా కరుణామయుని సృష్టి ప్రక్రియలో ఎటువంటి లోపము తెలియలేవు. కావాలంటే మరోసారి దృష్టిని సారించి చూడు, నీకేమయినా లోపము కనిపిస్తుందేమో!"**

ఈ ఆయత్‌లో నీవు ఎటు చూచినా ఒక దృశ్యమును చూచినట్లు చెప్పారు కదా! దేవుని సృష్టిని కావాలంటే మరోమారు దృష్టిని సారించి చూడు నీకేమయినా లోపము కనిపిస్తుందేమో అని చెప్పడము కూడా జరిగినది. దీనినిబట్టి దేవుని సృష్టిని దృశ్యరూపములో చూడమని, ఏదయినా లోపము కనిపిస్తుందేమోనని చెప్పారు కదా! ఇక్కడ సృష్టిని దృశ్యరూపముగా చూడమనేగా చెప్పినది. ఇక్కడ దేవుడు చెప్పినట్లు సృష్టిని దృష్టిరూపములో నికి మార్చుకొని దృశ్యముగా చూడగలిగితే ఏడు ఆకాశములు ఇలా ఉన్నవని ముందే ఒక విధముగా చిత్రించి చూచుకొన్నాము. ఇప్పుడు ఏడు ఆకాశముల మీద దేవుని ఉనికి ఎట్లున్నదో చిత్రించుకొని తర్వాత పేజీలో చూద్దాము.

ఏడు ఆకాశములపైన దేవుని నిలయమును దృశ్యరూపముగా చేసుకొన్నాము. దేవుడు నివశించు నివాసమును బ్రహ్మచక్రము అంటాము. బ్రహ్మచక్రము అనగా దేవుని చక్రమని అర్థము. దేవుని చక్రము రెండు భాగములుగా ఉన్నది. ఒక భాగము దేవుని పగలు, మరొక భాగము దేవుని రాత్రి. భగవద్గీతలో అక్షర పరబ్రహ్మయోగమున 17వ శ్లోకమున వేయియుగములు దేవునికి ఒక పగలు, అట్లే వేయియుగములు దేవునికి ఒక రాత్రి అని చెప్పారు. దేవుని చక్రము ఒక చుట్టు తిరుగుటకు రెండు వేల యుగముల కాలము పట్టునని తెలియుచున్నది. అనగా దేవునికి ఒక రోజు అంటే రెండువేల యుగముల కాలమని అర్థము. దేవుని యొక్క




బ్రహ్మనాడి (వెన్నుపాము) లో ఏడు నాడీకేంద్రములు ఏడు ఆకాశములుగా, ఆరు పని దినములు ఒక విశ్రాంతి దినముగా ఉండుటను చూడవచ్చును.

పగలు రాత్రిని గ్రహించగలిగితే ఎంతో ఉన్నతమైన జ్ఞానమును మనిషి తెలియగలడు. ఇదే విషయమునే ఖురాన్ గ్రంథములో సూరా 24, ఆయత్ 44లో ఈ విధముగా ఉన్నది చూడండి. **(24-44) "అల్లాహ్ రేయింబవళ్ళను మారుస్తూ ఉంటాడు. కళ్ళున్న వానికి ఇందులో గొప్ప గుణపాఠము కలదు."**

ఇక్కడ బాగా జాగ్రత్తగా వివరించుకొని చూస్తే **కళ్ళున్నవానికి** ఇందులో గుణపాఠము కలదని చెప్పారు కదా! దీనినిబట్టి దేవుని పగలు రాత్రిని చిత్రపటముగా చూచువానికి అందులోని రహస్య జ్ఞానము తెలియగలదని అర్థమగుచున్నది. అందువలన మేము దేవుని నివాసమును రాత్రి పగలుగా

విభజించి ఏడు ఆకాశముల పైనగల బ్రహ్మచక్రమును చూపాము. కొందరికి మేము చెప్పునది ఏమాత్రము అర్థము కాకపోవడము వలన మమ్ములను అజ్ఞానులుగా పోల్చి దూషించుచూ, అజ్ఞానమును బోధించు చున్నాడని అనవచ్చును. వారికి మేము చెప్పునదేమనగా! మేము ఎక్కడా స్వయముగా బోధించక దైవగ్రంథమును ఆధారము చేసుకొనియే చెప్పు చున్నాము. కొందరు తాము అజ్ఞానములో వుండి అల్లాహ్ నిదర్శనములు దర్శన రూపమైనప్పుడు, నిదర్శనాల విషయములో మొండిగా మాట్లాడు చున్నారు. ఇదే విషయమునే ఖురాన్ గ్రంథములో సూరా 40, ఆయత్ 35లో మొండివాదులను గురించి ఇలా చెప్పియున్నాడు చూడండి. **(40-35) "వారు తమవద్దకు వచ్చిన ఏ ప్రమాణమూ లేకుండానే అల్లాహ్ నిదర్శనాల విషయములో మొండిగా వాదిస్తారు. ఈ పోకడ అల్లాహ్‌వద్ద మరియు విశ్వాసులవద్ద కూడా ఎంతో అయిష్టకరమైనది. ఈ విధముగా గర్విష్ఠి, క్రూరుడైన ప్రతి వ్యక్తి హృదయముపై అల్లా ముద్ర వేసేస్తాడు."**

మేము జ్ఞానదృష్టి లేనివారికి కూడా అర్థమగులాగున, సూక్ష్మమైన దేవుని జ్ఞానమును స్థూలమైన గుర్తుగా, అందరికీ తెలియునట్లు దృశ్య రూపముగా చూపుచున్నాము. మేము ప్రతీదీ దైవగ్రంథముల ఆధారముతోనే చూపుచున్నాము. ఇక్కడ కొందరికి ఒక అనుమానము వచ్చి ఇలా ప్రశ్నించ వచ్చును. సూక్ష్మమైన దేవుని జ్ఞానము బోధల రూపములో ఉండగా, దృశ్య రూపములో చూచుటకు సాధ్యమగునా? అని అడుగవచ్చును. దానికి జవాబుగా మేము ఇలా చెప్పుచున్నాము. భగవద్గీత పురుషోత్తమ ప్రాప్తి యోగము అను అధ్యాయములో 10, 11 శ్లోకములలో ఈ విధముగా ఉన్నది చూడండి.

10వ. శ్లో॥ ఉత్క్రామన్తం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥

11వ. శ్లో॥ యతన్తో యోగిన శ్చైనం పశ్యన్త్యాత్మ న్యవస్థితమ్ ।
యతన్తో ప్యకృతాత్మానో నైనం పశ్యన్త్య చేతసః ॥

**భావము :-** "జీవాత్మ గుణములుదై శరీరములో నివాసముండును. గుణముల మధ్యలోవుంటూ విషయ సుఖములను అనుభవించుచుండును. ఈ విధానమును మూఢులు తెలియలేరు. జ్ఞాననేత్రులు మాత్రము చూడ గల్గుదురు."

"శరీరములోయున్న ఆత్మను, జీవాత్మను ప్రయత్నము చేయు యోగులు తెలియగలరు (చూడగలరు). మూఢులైనవారు ఎంత ప్రయత్నించి ననూ శరీరములోని తతంగమును దైవయంత్రాంగమును చూడలేరు."

ఖురాన్ గ్రంథములో నిదర్శనముగాయున్న దానిని చూడగలరన్నట్లు భగవద్గీత గ్రంథములో 5000 సంవత్సరముల పూర్వమే, శరీరములోని జీవుడు గుణముల మధ్యలో ఎట్లున్నదీ యోగులు తెలియగలరనీ, అజ్ఞానులు తెలియలేరని చెప్పారు.

దైవగ్రంథములలో ప్రమాణములుగా చెప్పినట్లు నిదర్శనమును దర్శనముగా చేసుకొనిన, ఏడు ఆకాశములు మన శరీరములో ఎట్లున్నదీ తెలిసిపోయినది. తర్వాత ఏడు ఆకాశముల మీద దేవుని స్థానము ఎట్లున్నదీ గుర్తించగలిగాము. అదే విధానముతో దేవుడు చెప్పిన జ్ఞానము ప్రకారము మూడు ఆత్మల విధానము, కర్మవిధానము, కర్మయొక్క గడువు విధానమును దృశ్యరూపములో చూచుటకు ప్రయత్నిద్దాము. మొదట జీవాత్మ నివాసమును

గురించి భగవద్గీత శ్లోకము ప్రకారము మరియు ఖురాన్ వాక్యము ప్రకారము చూచుటకు ప్రయత్నిద్దాము. ఏడు ఆకాశముల పైన పరమాత్మ ఉన్నట్లు అక్కడే ఏడు ఆకాశముల మీదనే జీవాత్మ కూడా కలదు. జీవాత్మ పరమాత్మ స్థానముకంటే కొద్దిగా క్రింద నివాసముండును. దానినే దృశ్యముగా చిత్రించుకొని క్రింది పటములో చూద్దాం.




ఈ చిత్రములో ఏడవ ఆకాశము మీదగల బ్రహ్మచక్రములో రెండు భాగములయందు దేవుడు కలడు. ఏడు ఆకాశముల పొడవునా ఆకాశము మధ్యలో అనగా బ్రహ్మనాడి మధ్యలో ఏడవ ఆకాశమునుండి ఒకటవ

ఆకాశము వరకు ఆత్మ గలదు. ఏడవ స్థానములోనే అనగా! ఏడవ ఆకాశములోనే బ్రహ్మచక్రము క్రింద మూడవ చక్రముగాయున్న గుణ చక్రమందు జీవుడు నివాసమున్నాడు. ఏడవ స్థానములో గల నాలుగు చక్రములలో పైది బ్రహ్మచక్రముకాగా క్రిందిది గుణచక్రముగా ఉన్నది. గుణచక్రము మూడు భాగములుగా ఉన్నది. మూడు భాగములలో ఏదో ఒకచోట జీవాత్మ ఉండడము జరుగుచున్నది. ఈ విధముగా ఏడవ ఆకాశములోనే అల్లాహ్ (దేవుని) కంటే క్రింద గుణచక్రములో జీవాత్మ ఉండగా, ఏడు ఆకాశముల పొడవునా బ్రహ్మనాడియందు ఆత్మ కలదు. ఈ విధముగా మూడు ఆత్మల నివాసము తేలిపోయి దర్శనరూపములోనికి వచ్చినది.

ఇప్పటికి ఏడు ఆకాశములు, మూడు ఆత్మల జ్ఞానము యొక్క నిదర్శనము, పరమార్థము తెలిసిపోయింది. ఇక తెలియవలసింది కర్మము, గడువులతో కూడుకొన్న కాలము. ఇప్పుడు కర్మను గురించి చూస్తే ఇలా తెలియగలదు.

కర్మచక్రము 12 భాగములుగా కలదు. అందులో 1,5,9 స్థానములలో పుణ్యము నిలువవుండును. అలాగే 3,7,11 స్థానములలో పాపము నిలువయుండును. మిగతా 2,4,6,8,10,12 స్థానములలో పాపపుణ్యములు రెండు గలవు. మనిషి చేసుకున్న పాపములు పుణ్యములు కర్మచక్రములో ఆయా స్థానములయందు ఆత్మ చేత నమోదగుచుండును. అలాగే ఆత్మ చేతనే అనుభవింప చేయబడుచుండును. అయితే కర్మచక్రము కంటే క్రిందగల గుణచక్రముతో కర్మచక్రమునకు సంబంధ ముండును. కర్మచక్రములోని కర్మ (పాపపుణ్యములు) క్రిందిచక్రమయిన గుణచక్రము మీద ప్రసరించడము వలన అక్కడున్న జీవుడు దానిని అనుభవించును.




**కర్మచక్రము**

ఇదే విషయమును ఖురాన్ గ్రంథములో ఎవని కర్మ వాడే అనుభవించవలెనని సూరా 2, ఆయత్ 134లో చెప్పియున్నారు. **(2-134) "అది గతించిన ఒక సమూహము. వారు చేసుకొన్నది వారికే చెందుతుంది. మీరు చేసినది మీకు చెందుతుంది. ఇతరుల కర్మల గురించి మీరు ప్రశ్నింపబడరు"** అని గలదు. దీనినిబట్టి పైన కర్మచక్రములో ఏమి నమోదయివుంటే క్రింది చక్రములో గల జీవునికి అదే అనుభవమునకు వచ్చును. ఇతరుల కర్మతో జీవునిక సంబంధమే లేదు. దాని ప్రక్రియలో గుణచక్రములోని గుణములు జీవుని మీద ప్రయోగించబడును. గుణచక్రమును బాగా పరిశీలించిన ఈ విధముగా కలదు. తర్వాత పేజీ పటములో చూడండి.




**గుణచక్రము**

గుణచక్రము మూడు భాగములుగా కలదు. ఒక్కొక్క భాగమున వేరువేరు పేర్లుగల పన్నెండు గుణములుగలవు. ఒక్కొక్క భాగములోగల గుణములకు ఒక్కొక్క పేరున్నది. పై భాగములో గల గుణములను తామస భాగ గుణములని చెప్పుచుందురు. అట్లే మధ్యలోయున్న దానిని రాజస గుణ భాగము అని అంటాము. అట్లే మూడవ దానిని సాత్త్విక గుణభాగము అంటాము. మధ్యలో గుండ్రముగాయున్న భాగము బ్రహ్మనాడిగా ఉన్నది. దానిని గుణరహిత భాగము (గుణములేని భాగము) అని అంటాము. ఈ మూడు గుణ భాగములలోనూ గుణములు గలవు. ఒక్కొక్క భాగములో 12 గుణములు కలవు. అందులో ఆరు మంచి గుణములు, ఆరు చెడు గుణములు గలవు. చెడు గుణములు వరుసగా కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరము అని అంటారు. మంచి గుణములను వరుసగా దాన, దయ, ఔదార్య, వైరాగ్య, వినయ, ప్రేమ అని అంటారు. చెడు గుణములలో జీవుడు చేరితే పాపము వచ్చును. మంచిగుణములలో జీవుడు

చేరితే పుణ్యము వచ్చును. జీవుడు తామస, రాజస, సాత్త్విక అను మూడు గుణ భాగములయందు తిరుగుచుండును. ఏ ఒక్క గుణభాగములో కూడా శాశ్వతముగా ఉండడు. అయితే ఎక్కువ కాలము ఏ భాగములో గడిపితే ఆ భాగము యొక్క పేరు వానికి వచ్చుచుండును. తామసములో ఎక్కువ కాలముయున్న వానిని తామసుడనీ, రాజసములో ఎక్కువ కాలమున్న వానిని రాజసుడనీ, సాత్త్వికములో ఎక్కువ కాలమున్న వానిని సాత్త్వికుడని అంటాము.

క్రింద గుణచక్రముండగా దానిపైన కర్మచక్రముండును. గుణ చక్రములోని జీవుడు చేసుకొన్న పాత పాపపుణ్యములను కర్మచక్రమునుండి ఆత్మ అనుభవింపజేయును. అట్లే ప్రస్తుత కాలములో చేసుకొన్న పాపపుణ్యములను ఆత్మే కర్మచక్రములో నమోదు చేయుచున్నది. గుణచక్రమునకు పైనగల కర్మచక్రమునుండి కర్మ దిగి అనుభవమునకు వస్తున్నది. అలాగే జీవుడు క్రొత్తగా చేసుకొన్న కర్మ కర్మచక్రములోనికి ఎక్కుచున్నది. దేవుడు ఏడవ స్థానము (ఏడవ ఆకాశము)న ఉండి క్రిందికి దిగే కర్మను, పైకి ఎక్కే కర్మను చూస్తున్నాడు. దేవుడు సాక్షిగా మాత్రమున్నాడు. రెండవ ఆత్మ మాత్రము శరీరములో కార్యములన్నీ చేయుచున్నది. ప్రతి విషయములో జీవున్ని కర్మబద్ధున్ని చేసి కర్మను అనుసరించి నడుపుచున్నది. దేవుడు మాత్రము ఏమీ చేయక దిగే కర్మను ఎక్కే కర్మను చూస్తున్నాడు. ఇదే విషయమునే ఖురాన్ గ్రంథమందు సూరా 34, ఆయత్ 2లో ఇలా వుంది చూడండి. **(34-2) "భూమిలోనికి వెళ్ళేది, దానినుండి వెలువడేది, ఆకాశమునుండి దిగేది, అందులోనికి (ఆకాశము లోనికి) ఎక్కిపోయేది అంతా ఆయనకు (దేవునికి) తెలుసు. ఆయన అపార కరుణా ప్రదాత, క్షమాశీలి"** అని కలదు.

దేవుని జ్ఞానము ప్రకారమే కర్మ జీవుని మీదికి దిగేది, జీవుని నుండి కర్మచక్రములోనికి నమోదు అయ్యేది, ఖచ్చితముగా మనము దృశ్య రూపము చేసుకొన్నాము. కర్మచక్రము పైన కాలచక్రము కలదు. కాల చక్రములో ప్రతి దానికి కాల గడువు నిర్ణయించబడియుండును. కాల చక్రములో నిర్ణయించిన కాలము యొక్క గడువు ప్రకారము క్రింద కర్మ చక్రములోని కర్మ జరుగుచుండును. అందువలన ఎప్పుడు చనిపోవలసిన వాడు అప్పుడే చనిపోవును. జరుగవలసిన కార్యమేదయినాగానీ ఒక్క సెకండు కూడా తేడా లేకుండా జరుగును. అది కాలచక్రములోని కాలము యొక్క నిర్ణయమును ఎవరూ మార్చలేరు. కాలచక్రమును క్రింద దృశ్య రూపముగా చూచుకొందాము.

కాలచక్రము మొత్తము పన్నెండు భాగములుగా యున్నది. ఒక్కొక్క భాగము ఒక్కొక్క పేరుతో కలదు. ప్రతి భాగమునందు రెండు గంటల కాలముండును. ఆ కాలచక్రము, కర్మచక్రము, గుణచక్రము ఒకదానితో ఒకటి సంబంధపడియుండి తిరుగుట వలన, వేరువేరు సమయములలో, వేరు కర్మలను, వేరువేరు అనుభవములుగా జీవుడు అనుభవించుచుండును. దేవుడు తన జ్ఞానము ప్రకారమే మనిషిని సృష్టించి, తన జ్ఞానము ప్రకారమే నడుచునట్లు చేశాడు. దేవుడు అన్నిటినీ చూస్తున్నాడు. ఆయనకు తెలియకుండా ఏమీ జరుగవు. దేవుని జ్ఞాన పరమార్థమును, నిదర్శనమును పూర్తి దర్శనముగా చూచుకొంటే తర్వాత పేజీలో చిత్రించిన విధముగా కలదు చూడండి.

మనిషి శరీరములో మనిషికి మూలమైన ఈ చక్రము ఉండుట వలన, భగవద్గీత పురుషోత్తమ ప్రాప్తి యోగమున మొదటి శ్లోకములోనే "ఊర్ధ్వమూల" అని చెప్పియున్నారు. ఆ మాటకు పైన మూలమున్నదని అర్థము.




**కాలచక్రము**

దేవుని గ్రంథములలో గల దేవుని జ్ఞానమును దృశ్యరూపము చేసుకొంటే అది దేవునికి సంబంధించిన ముద్రయగును. రాజు శాసనములకు గుర్తుగా రాజముద్ర ఉన్నట్లు, దేవుని ధర్మములకు గుర్తుగా దేవుని ముద్ర లేక దేవుని చిహ్నము కలదు. దేవుని చిహ్నము, దేవుని జ్ఞానమునకు ప్రతిరూపముగా ఉండుట వలన అందులో దైవశక్తి కలదని చెప్పవచ్చును. దైవశక్తి ఎక్కడవుండునో అక్కడ కర్మ కాలిపోవును. అగ్ని ఎక్కడుంటే అక్కడ మండే వస్తువులు ఏవున్నా అగ్నిచేత కాలిపోవునట్లు, దైవశక్తి ఉన్నచోట ఏ కర్మలున్నా జానాగ్నికి అంటుకొని కాలిపోవును.

**ప్రశ్న :-** మీరు దృశ్యరూపముగా చూపిన దేవుని చిహ్నమునకు నిజముగా దైవశక్తి ఉంటుందంటారా?




**జవాబు :-** దైవ జ్ఞానములోని ముఖ్యమైన వాటిలో (1) భూమి ఆకాశముల సృష్టి విషయము. 2) మూడు ఆత్మల విషయము. 3) కర్మల యొక్క విషయము. 4) కాల నిర్ణయము యొక్క విషయ జ్ఞానములు ఉండుట వలన దేవుని గుర్తుకు దేవుని శక్తి అంటుకొనియున్నది. ఈ నాలుగు జ్ఞానముల మినహా ఆధ్యాత్మిక జ్ఞానము లేదు. దేవుని జ్ఞానములో ఏది చెప్పినా ఈ నాలుగు అంశముల జ్ఞానమే ఉండును. ఆధ్యాత్మిక జ్ఞానములో పై నాలుగు జ్ఞానములే ముఖ్యమైనవగుట వలన, దేవుని ముద్రగా చూపబడిన చిత్రమునకు లేక ఆకారమునకు దైవశక్తియుండునని చెప్పుచున్నాము.

**ప్రశ్న :-** మీరు ఒక సంఘటనలో షఫీ అను వ్యక్తికి ముఖము మీద దేవుని

గుర్తును ధరించమని చెప్పారు. మీరు అక్కడ చెప్పిన గుర్తుకు, ఇక్కడ చూపిన గుర్తుకు ఏమయినా తేడా వుందా? లేక రెండూ ఒకటేనా?

**జవాబు :-** అక్కడ షఫీగారికి చెప్పిన దేవుని చిహ్నము, ఇప్పుడు ఇక్కడ చూపిన దేవుని గుర్తు రెండూ ఒక్కటే. రెండిటియందూ ఒకే దైవశక్తి యుండును.

**ప్రశ్న :-** దేవుని గుర్తని మీరు చూపిన చిహ్నము ఒక్కటే కదా! ఖురాన్‌లో దేవుని చిహ్నాలు అని బహువచనముగా చెప్పారు కదా! మీరు ఏక వచనముగా యున్న ఒకే గుర్తును చూపుచున్నారు కదా! అక్కడ ఖురాన్‌లో చెప్పినవి వేరు కావా?

**జవాబు :-** నాలుగు జ్ఞానములకు నాలుగు గుర్తులను విడివిడిగా చెప్పితే వాటిని దేవుని చిహ్నాలు అనియే చెప్పవలసివచ్చును. అయితే నాలుగు జ్ఞానముల గుర్తులయిన నాలుగు చక్రములు ఒకే బ్రహ్మానాడిలో అతుక్కొని యుండుట వలన అన్నిటినీ కలిపి ఒకే చిహ్నమని చెప్పవచ్చును.

**ప్రశ్న :-** దేవుని చిహ్నముగాయున్న ఆకారమునకు దైవశక్తి యున్నదని మీ యొక్క ఊహాతో చెప్పుచున్నారా? లేక మీ అనుభవముతో చెప్పుచున్నారా?

**జవాబు :-** మేము ఊహలతో, అంచనాలతో చెప్పువారము కాదు. ఏదయినా శాస్త్రబద్ధత కూడినదై, యదార్థ సత్యమైనప్పుడే దానిని గురించిన సత్యమును మేము చెప్పుదుము. మేము చెప్పినదంతా అనుభవ సత్యము. మేము ఇంతవరకు అరవై నాలుగు గ్రంథములను వ్రాశాము. మేము చెప్పిన జ్ఞానమును విని ఇతరులు కూడా నాలుగు గ్రంథములను వ్రాశారు. మేము వ్రాసిన అరవైనాలుగు (64) గ్రంథములను ఇతరులు వ్రాసిన నాలుగు

గ్రంథములను మేమే అచ్చు వేయించాము. మొత్తము అరవై ఎనిమిది గ్రంథములలోనూ అంతో ఇంతో దేవుని చిహ్నమును గురించిన జ్ఞానము కొంతయినా ఉండుట వలన, ఆ గ్రంథముల మీద దేవుని చిహ్నము యొక్క ఆకారముండుట వలన, ఆ గ్రంథములను మేము ఒక్కమారు తాకి యుండుట వలన, దైవశక్తి ఆ గ్రంథములలో కూడా సంపూర్ణముగా చేరి యుండును.

**ప్రశ్న :-** మీ వద్ద తయారయిన గ్రంథములకు దైవశక్తి ఉందని ఎలా నిరూపించగలరు?

**జవాబు :-** నిరూపణ అను పదమును మీరు వాడారు కదా! అందులో రూపము లేనిదని అర్థము. రూపములేని జ్ఞానమును నిరూపణ లేక నిదర్శన అనడము మనకు తెలియకున్నా జరుగుచున్నది. నిరూపణ, నిదర్శనమైన జ్ఞానమును మా మెదడులో ప్రతిష్ఠించుకొన్నాము, కావున మేము ఒకమారు చూచితే మా గ్రంథములలో పూర్తి శక్తి ఇమిడిపోవుచున్నది. మీకు నిరూపణకు రావాలంటే బాగా పెద్ద బాధను అనుభవించు వానిని తీసుకొందాము. కర్మల అనుభవము ఎంత ఉండునో మనకు ఎవరికీ తెలియదు, కనుక మనకు తెలసి ఒక గంట బాధను అనుభవించు వ్యక్తిని తీసుకొందాము. ఆ గంటనో లేక రెండు గంటలో ఎక్కువగా బాధపడుచున్న వానిని, వాడు బాధపడుచున్నట్లు ఇతరులు చూస్తూనే తెలియునట్లు ఉండువానిని తీసుకొందాము. అయితే బాధ బయటికి కనబడువాడు మనకు దొరుకవచ్చునుగానీ, గంట లేక రెండు గంటలే అనుభవముండు వాడు అని తెలియదు కదా! అందువలన గంట లేక రెండు గంటల నొప్పి ఉండుటకు తేలు కుట్టినవాడు అయితే సరిపోతుంది.

తేలు కుట్టిన వాడు విషము బాధను భరించలేక అతను బాధపడుట బయటికి బాగా కనిపించును. కొన్ని తేళ్ళ విషములు చాలా నొప్పిని కల్గించునవై ఉండుట వలన దానిని అనుభవించువారు చాలా బాధ పడు చుందురు. వారి బాధ చెప్పలేనంతటిదిగా ఉండును. తేలు బాధ ఎంత యున్నా ఒక గంట నుండి రెండు గంటల వరకు లేక మూడు గంటల వరకు అనుభవము ఉండును. అంటే తేలు బాధకు సరిపడు కర్మ రెండు లేక మూడు గంటలకంటే ఎక్కువ ఉండదు. ఇప్పుడు తేలు కుట్టిన వాని బాధను వారు పూర్తి అనుభవించనయినా అనుభవించాలి లేక దేవుడు క్షమించనయినా క్షమించాలి. దేవుడు క్షమించడము అంటే దేవుని శక్తి వాని కర్మను లేకుండా కాల్చివేయడము వలన వాని బాధను వాడు అనుభవించుట తప్పిపోవును.

**ప్రశ్న :-** మీరు చెప్పిన మాట ఎక్కడయినా శాస్త్రబద్ధమై ఉన్నదా? లేక మూఢనమ్మకముగా చెప్పుచున్నారా?

**జవాబు :-** "మేము శాస్త్రబద్ధము కాని విషయమును చెప్పము" అని ముందే చెప్పాము కదా! మేము చెప్పు మాటకు శాస్త్రబద్ధత కావాలంటే ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతా గ్రంథములో జ్ఞానయోగమను అధ్యాయమున 37వ శ్లోకమున చెప్పారు చూడండి.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోగ్ని భస్మసాత్కురుతేర్జున ।
జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥

**భావము :-** "కట్టెలు అగ్నిలో పడితే ఏ విధముగా కాలి బూడిద అయిపోతాయో, అదే విధముగా జ్ఞానమను అగ్నిలో కర్మలను కట్టెలు కాలిపోవును" భగవద్గీతలో చెప్పిన దానిప్రకారము జ్ఞానాగ్ని ఎక్కడయున్నా

అక్కడ గల కర్మ కట్టెలను కాల్చివేయును. శాస్త్రబద్ధముగా జ్ఞానముతో తయారయిన బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములను దేవుని చిహ్నముయందు జ్ఞానాగ్ని ఉండుట వలన అది తన పరిధిలోని కర్మలను కాల్చివేయును. రెండు గంటలు లేక అంతకంటే ఎక్కువ కాలము బాధగల తేలు విషము నొప్పి ఎక్కడకలదో చూచి, దైవచిహ్నముగల మా గ్రంథములలో ఏ గ్రంథమయినా ఒక గ్రంథమును అక్కడ పెట్టుట వలన, అతని బాధ నాలుగు లేక ఐదు నిమిషములలో నివారింపబడును. తేలునొప్పి గల ప్రదేశములో మా గ్రంథమును ఉంచిన వెంటనే గ్రంథము ఇనుపముక్కకు అయస్కాంతము అతుక్కున్నట్లు అక్కడే అతుక్కొని పోవుచున్నది. అలా అతుక్కున్నప్పుడు కొద్ది బలమునుపయోగించి లాగినా ఆ గ్రంథము ఊడిరాదు. అలా అతుక్కున్న గ్రంథము దాదాపు ఐదారు నిమిషముల తర్వాతగానీ ఊడిరాదు. ఎప్పుడయితే వాని కర్మ అంతయూ కాలిపోయి వాని బాధ నివారణ అగుచున్నదో అప్పుడు ఆ గ్రంథము ఊడివచ్చుచున్నది. అంతవరకు గ్రంథములోని జ్ఞానాగ్ని అతను అనుభవించే కర్మను కాల్చివేయుచున్నట్లు అర్థమగుచున్నది. ఇది ప్రత్యక్ష అనుభవ సత్యము.

రెండు గంటల కర్మ కాలిపోవుటకు దాదాపు నాలుగునుండి ఐదు లేక ఆరు నిమిషముల కాలము పట్టితే, దానికంటే తక్కువ కర్మను తొందరగా కాల్చివేయునని చెప్పవచ్చును. ఎక్కువ కొన్ని నెలలు సంవత్సరములు అనుభవించు కర్మను కాల్చుటకు ఎక్కువ కాలము పట్టును. మనకు నిరూపణకు వచ్చుటకు ఉదాహరణగా తేలుకుట్టిన వారిని దేవుని గుర్తుతో వారి పాపములను కొన్ని నిమిషములలోనే కాల్చివేయవచ్చును. ఇది ప్రత్యక్ష నిరూపణ. ప్రత్యక్షముగా మా గ్రంథములను పెట్టుకొని చాలామంది వారి కర్మలను కాల్చుకొన్న సందర్భములు కలవు. దేవుని చిహ్నమును ధరించినవాడు గానీ దేవుని చిహ్నము మీద నమ్మకముగలవారుగానీ వారి

కర్మలను వారే కాల్చుకొన్న సందర్భములు అనేకము కలవు. దైవగ్రంథముల వెలుగులో మేము దేవుని చిహ్నమును నిరూపణగా యున్నదనీ, దానిని రూపము చేయవచ్చుననీ, అదే దేవుని గుర్తని, అదే అన్ని మతములకు సంబంధించినదనీ, అది ఏ ఒక్క మతమునకు సంబంధము లేనిదనీ, చెప్పినప్పుడు మమ్ములను అర్థము చేసుకోలేని వారు మేము దైవగ్రంథమునకు వ్యతిరేఖముగా మాట్లాడుచున్నామని 'ఫేస్‌బుక్'లో హేళనగా మాట్లాడినారు. మేము చెప్పిన జ్ఞానాగ్ని లేక దైవశక్తి మీ వద్ద కలదేమో కొద్దిగా ఆలోచించుకోండి. ప్రత్యక్షముగా కర్మకాలిపోవు విధానమును చూచినవారు వారి గ్రంథములలో ఏదో మాయ, మంత్రములు ఉన్నాయని కూడా చెప్పారు. మేము వ్రాసిన హిందువుల గ్రంథములలో మాయ మంత్రము ఉండవచ్చుననుకొందాము. 33 సంవత్సరముల ఒక ముస్లీమ్ యువతి వ్రాసిన **"ఖుర్‌ఆన్‌లో ఆణిముత్యాలు"** అను ముస్లీమ్ గ్రంథములో కూడా మాయ మంత్రములున్నవని చెప్పగలరా?

చిన్న విష పురుగు ఒక ఆడమనిషికి ఎదకు పైన గొంతు క్రింద కుట్టినప్పుడు దాని విష ప్రభావమునకు వాపు మంట వచ్చియుంటే, ఆమె తనకు దగ్గరగాయున్న **"ఖురాన్‌లో ఆణిముత్యాలు"** అను గ్రంథమును పురుగు కుట్టిన జాగాలో పెట్టగా, అది గట్టిగా అతుక్కొని కొద్దిసేపు లాగినా రాకుండా ఉండడమును ప్రత్యక్షముగా చూచినవారు కలరు. ఆ దృశ్యమును నాకు చూపాలని సెల్‌ఫోన్‌లో చిత్రించి తెచ్చి చూపారు. ఖుర్‌ఆన్‌లో ఆణిముత్యాలు అను గ్రంథము అరబ్బీ, ఉర్దూ, ఇంగ్లీషు, తెలుగు భాషలలో గల గ్రంథము. ఆ గ్రంథము ఆమెకు అతుక్కొనియుండగా ఆమె గట్టిగా లాగిచూచినా అది ఊడిరాలేదు. గట్టిగా లాగుతూవుంటే చేయి జారిపోయినప్పుడు గ్రంథము జారిపోయిన శబ్దము వినిపిస్తూవుంది కానీ అది ఊడి రాలేదు. ఇదంతా

మీకు క్రొత్తగా కనిపించవచ్చును, అయినా నూటికి నూరుపాళ్ళు సత్యము. గ్రంథములోని జ్ఞానముయొక్క విలువను, దేవుని గుర్తుయొక్క శక్తిని గురించి మేము చెప్పగా, వినిన చాలామంది వారంతకు వారే గ్రంథములను వారి నొప్పులవద్ద పెట్టుకొని ఆ కర్మలను పోగొట్టుకున్నారు. మేము ఇంతవరకు ప్రత్యక్షముగా ఎవరికీ ఈ ప్రయోగము చేయలేదు. చేసినవారు చెప్పగా విన్నాము, వీడియోలలో చిత్రించి చూపగా చూచాము. మేము చెప్పునది సత్యము అని తెలియునట్లు గ్రంథములు శరీరముకు అతుక్కున్న ఫోటోలను 81వ పేజీలో చూడండి.

దైవగ్రంథములలో ఎక్కడయినా కొద్దిగా కల్పిత కాలుష్యము ఉండవచ్చునేమోగానీ, మా గ్రంథములలో అజ్ఞాన కాలుష్యముగానీ, కల్పిత కాలుష్యము గానీ ఉండదు. మేము దేవుని జ్ఞానమును గౌరవించాలను వారమే గానీ అగౌరవపరచవలెనను వారము కాదు. మేము ఒక మతమునకు సంబంధించి కాకుండా, అన్ని మతములలో ఎక్కడ ప్రజలు అర్థమును అపార్థము చేసుకొన్నారో అక్కడ తిరిగి అర్థము చెప్పాలనునదే మా ఉద్దేశ్యము. మేము ఒక మతమును సమర్థించుటగానీ, అసమర్థించుటగానీ ఉండదు. అయితే కొందరు మా ఉన్నతమైన భావమును తెలియలేక మమ్ములను కూడా దూషణ భావముతో మాట్లాడుచుందురు. ప్రతి ఒక్కరు ఎవరి మతమును గురించి వారు ఎక్కువగా చెప్పడము, ఇతరుల మతమును గురించి తక్కువ చేసి మాట్లాడడము జరుగుచున్నది. అటువంటివారు అందరికీ దేవుడు ఒక్కడే అను మాటను మరచిపోయి, ఒక్కొక్క మతమునకు ఒక్కొక్క దేవుడని చెప్పుచుందురు. అటువంటి వారు సంకుచిత భావము గలవారే గానీ విశాల భావము లేనివారని తెలియుచున్నది. వారి మత అభిమానము వారిని అజ్ఞానులుగా చేయుచున్నది.

మతాభిమాని ఇతర మతములను దూషించడమేకాక, తమ దైవగ్రంథమని చెప్పుకొను గ్రంథములోనున్న సత్యమును తెలియలేక పోవు చున్నాడు. తన గ్రంథములోని వాక్యములకు నిజభావమును తెలియలేక, ఆ వాక్యము నుండి తప్పు సమాచారమును స్వీకరించి, అదే సమాచారమును తమ సంఘము వారికందరికీ బోధించి, అందరినీ తప్పు దారిపట్టించి, అందరినీ వ్యథల పాలగునట్లు చేయుచున్నారు. సత్యము చెప్పి దీనిని వాడవద్దని చెప్పితే దానిని వాడరుగానీ, ఎప్పుడు వాడకూడదని ఆలోచించరు. రోగము వచ్చినప్పుడు దీనిని వాడకూడదు అంటే, దానిని అర్థము చేసుకోక రోగము లేనప్పుడు కూడా వాడకుండా ఉండడము తెలివి తక్కువ పనికాదా!

అదే విధముగా ఖురాన్ గ్రంథములో దేవుడు ఒకటి చెప్పితే, దానిని వారు అర్థము చేసుకోలేక మరొకదానిగా తాము అర్థము చేసుకోవడము జరిగినది. ముస్లీమ్ పెద్దలు చెప్పినట్లే మిగతా ముస్లీమ్‌లందరు వినవలెనను నియమము ఉండుట వలన, ఒక పెద్దకు అర్థమయిన విషయమే అందరికీ ప్రాకుచున్నది. ఆ విధముగా ముఖ్యమైన వ్యక్తి ఒకరు తప్పు దారిపట్టితే, మిగతా వారంతా తప్పు దారిపట్టు అవకాశము గలదు. ఖురాన్ విషయములో అదే జరిగింది. సూరా 2, ఆయత్ 187 లో ఉన్న సమాచారము ఈనాటికీ అర్థము కాలేదనియే చెప్పవచ్చును. అక్కడ దేవుడు ఒక దానిని నిషేధము అని చెప్పితే, నేడు దేవుడు చెప్పిన దానిని నిషేధించక, పొరపాటుగా మరొక దానిని నిషేధించుకొన్నారు. అలా చేయడము వలన చేయని తప్పుకు అందరూ శిక్ష అనుభవించినట్లయినది. దేవుడు ఖురాన్ గ్రంథములో కొన్ని వాక్యములలో ఎంతో విపులముగా చెప్పుచున్నాను, ఎంతో విశదముగా చెప్పుచున్నాను, ఎంతో విశదీకరించి చెప్పుచున్నాను అని చెప్పియున్నాడు. ఎందుకు అంతచిన్న విషయము

అర్థము కాలేదో చెప్పుటకు వీలులేకున్నది. ఒక విధముగా ఇక్కడ అందరినీ దేవుడే ఉద్దేశ్యపూర్వకముగా తప్పుదారి పట్టించాడని అర్థమగుచున్నది.

సూరా 2, 187వ ఆయత్‌లో మొదలు పెట్టిన విషయము అందరికీ అర్థమగులాగునవుంది. వాక్యమంతా మొదలు పెట్టిన విషయమునే చెప్పారు. వాక్యము చివరిలో కూడా మొదలు పెట్టిన విషయమును గురించి చెప్పుచూ ఆయత్‌ను ముగించడమైనది. ఈ వాక్యములో దాచిపెట్టిగానీ, మూసిపెట్టిగాని చెప్పినది ఏమీలేదు. మొదటికి ఇది సూక్ష్మమైన (ముతషా బిహాత్) జ్ఞానము కూడా కాదు. వాక్యములో చెప్పినదంతా స్థూలమైన (ముహ్కామాత్) విషయమే. అటువంటపుడు ఆ వాక్యములో పూర్తి సమాజమంతా అనగా కొన్ని కోట్లమంది దేవుడు చెప్పిన విషయమును వదలి, పూర్తిగా సంబంధములేని విషయములో తగులుకొన్నారు. అలా ఆ విషయము పూర్తి సమాజములో ప్రాకిపోవడము వలన అందరూ ఇష్టమున్నా, ఇష్టము లేకపోయినా ఆ నియమమును పాటించవలసి వచ్చినది. దేవుని ఆజ్ఞ అను భయముతో అందరూ తమ పెద్దలు చెప్పినట్లు నడుస్తున్నారు. అలా నడువడము వలన ఏమయినా దేవుని విషయములో ప్రయోజనముందా అని ఆలోచిస్తే, దేవుడు చెప్పని విషయమును ఆచరించడము వలన మరియు దేవుడు చెప్పిన విషయమును వదలి వేయడము వలన, దేవుని జ్ఞానమునకు దేవుని మాటకు వ్యతిరేఖముగా ప్రవర్తించినట్లగుచున్నది. దానివలన దేవునికి దగ్గరయ్యేదానికి బదులు, దేవునికి దూరమవడము జరుగుచున్నది. స్థూల జ్ఞాన విషయములోనే ఇంతగా పొరపాటుపడినప్పుడు, సూక్ష్మ జ్ఞాన విషయములో ఎంతో పొరపాటు పడుటకు అవకాశము గలదు.

ఇవన్నీ మేము ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే! మేము 'మా' 'మీ' అను మత ప్రసక్తి లేకుండా మనుషులంతా ఒకటే, అందరికీ దేవుడు ఒక్కడేయను ఉద్దేశ్యముతో, ఏ మతమువారు దేవుని వాక్యమును సరిగా అర్థము చేసుకోక పోయినా, వారిని తట్టిలేపి నీవు ఇక్కడ పొరపడినావు అని చెప్పడము మా బాధ్యతగా పెట్టుకొన్నాము. అందువలన మేము మూడు గ్రంథముల విషయములను విపులీకరించి శాస్త్రబద్ధముగా, హేతు బద్ధముగా చెప్పుచున్నాము. చెప్పడము వరకే మా బాధ్యత, విన్నవారంతా నా మాటను అనుసరించమని మేము చెప్పడము లేదు. దేవుని జ్ఞానమును వినినవారు జ్ఞానమార్గములో పోవునది, అజ్ఞాన మార్గములో పోవునది దేవుడే నిర్ణయించును. తనకు ఇష్టమైన వారిని జ్ఞానమార్గములో పంపును, తనకు ఇష్టము లేనివారిని అజ్ఞాన మార్గములో పంపును. ఆ విషయములో ఏ మానవుని ప్రమేయము ఉండదు. అంతా అల్లాహ్ ఇష్టము మీద ఆధార పడియుండును. మనిషికిగల శ్రద్ధనుబట్టి, బుద్ధినిబట్టి దేవుని కరుణకు మనిషి పాత్రుడు కాగలడు.

మా వద్ద మత భేదములులేవు అట్లే కులభేదములు కూడా లేవు. అందువలన మేము ఒక ప్రకటనలో **"మతాలు నిషేదము, నిషిద్ధము. కులాలు అహేతుకము అశాస్త్రీయము. కుల మతాలకు అతీత భావము లున్న వారు ప్రబోధ సేవాసమితి అను మా సంఘములో చేరండి"** అని చెప్పడమైనది. మా జ్ఞానమును విన్నవారు ఎందరో మా వద్దకు రావడము జరిగినది. అందువలన అన్ని మతముల వారు ఏకతాటి మీద అసలయిన దైవజ్ఞానములో ఉన్నారు.

**ప్రశ్న :-** దైవజ్ఞానమును సరిగా అర్థము చేసుకొని దానిని అనుసరిస్తే జ్ఞానాగ్నిలో కర్మలు (పాపములు) కాలిపోవునని చెప్పారు కదా! అదే

విషయము మీ జ్ఞానము వద్ద ప్రత్యక్షముగా కనిపించుచున్నదని చెప్పారు కదా! మేము సక్రమమైన జ్ఞానమును అనుసరిస్తే మాకు అటువంటి శక్తి వచ్చునా? మాలోని కర్మలు కాలిపోవునా? ఇట్లు జరుగునని మా ఖురాన్ గ్రంథములో గానీ, మా బైబిలులోగానీ చెప్పలేదేయని ముస్లీమ్‌లు, క్రైస్తవులు అడుగ వచ్చును. దానికి మీరు ఏమి జవాబిస్తారు?

**జవాబు :-** మంచి ప్రశ్నే అడిగారు, దానికి మంచి జవాబే కలదు చూడండి. ఖురాన్ గ్రంథములో దేవుడు మీ కర్మలను క్షమించేవాడు అని అనేక సందర్భములలో చెప్పాడు. అంతేకాక ఖురాన్‌లో ప్రతి సూరా ప్రారంభము లోనూ అందరికీ జ్ఞాపకముండులాగున **"అపార కరుణామయుడు, పరమ కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో ప్రారంభము"** అనియూ, అనంత కరుణా మయుడు, అపార క్షమాశీలుడయిన అల్లాహ్ పేరుతో ప్రారంభమని చెప్పడము ప్రతి ఖురాన్ గ్రంథములో జరిగియుండును. దీనినిబట్టి దేవున్ని మనము వేడుకొంటే ఆయన మన పాపములను క్షమించగలడని తెలియు చున్నది. అంతేగాక ఖురాన్ గ్రంథములో 39వ సూరాయందు 53వ ఆయత్‌నందు కూడా పాపక్షమాపణ విషయమును గురించి చెప్పాడు **(39-53) "తమ ఆత్మలపై అన్యాయానికి పాల్పడిన ఓ నా దాసులారా! మీరు అల్లాహ్ కారుణ్యముపట్ల నిరాశ చెందకండి. నిశ్చయముగా అల్లాహ్ పాపాలన్నిటిని క్షమిస్తాడు. నిజంగా ఆయన అమితముగా క్షమించేవాడు, అపారంగా కరుణించేవాడు"** ఇదే విధముగా అనేక ఆయత్‌లలో దేవుడు కరుణామయుడు, క్షమాశీలుడు అని అనేక సందర్భములలో చెప్పాడు.

దీనినిబట్టి భూమిమీద గల ముస్లీమ్‌లందరికీ నా జ్ఞానమును అనుసరించే వారి పాపములను నేను లేకుండా చేస్తాననీ, క్షమించివేస్తానని, దేవుడు హామీ ఇచ్చాడని తెలియుచున్నది. దేవుని జ్ఞానమును తెలిసి ఆచరించ

గలిగితే ఎంతటి పాపాత్ములైనగానీ దేవుని చేత క్షమించబడుననీ, అటువంటి వానికి దేవుని జ్ఞానము పాపములను కాల్చివేయునని తెలియుచున్నది. ఈ మాట దేవుడు చెప్పినది కాబట్టి సర్వమానవులకు వర్తించును. ఒక్క ముస్లీమ్‌లకని అనుకోకూడదు. దేవుని జ్ఞానము సమస్త మానవులకు వర్తించును. ప్రజలకు జ్ఞాపకము చేయు నిమిత్తము మూడు గ్రంథముల లోనూ పాప క్షమాపణ విషయము చెప్పవలసి వచ్చిందిగానీ, వేరువేరు మతములలో వేరువేరు క్షమాపణ అనుకోకూడదు. ఏ దైవ గ్రంథములో మాట అయినా సమస్త మానవులకూ వర్తించును.

ద్వితీయ దైవగ్రంథములో కూడా అనగా బైబిలు గ్రంథములో కూడా ప్రత్యేకించి నాలుగు సువార్తలలో దేవుడు పాపములను క్షమించునని చెప్పాడు. అక్కడ చెప్పిన విషయమును కూడా క్రైస్తవులుగాయున్నవారు సరిగా అర్థము చేసుకోలేదు. దేవుని వాక్యము ఒక విధమైన జ్ఞానమును చెప్పగా, మనుషులు ఆయన మాటను అర్థము చేసుకోలేక వేరు విధముగా చెప్పుకొంటున్నారు. మత్తయి సువార్త 26వ అధ్యాయములో 28వ వచనము ఈ విధముగా ఉన్నది చూడండి **(మత్తయి 26-28) "ఇది నా రక్తము అనేకుల పాప క్షమాపణ నిమిత్తము చిందింపబడుచున్న నిబంధన రక్తము"** అని చెప్పాడు. ఈ వాక్యములో ఇది నా **"నిబంధన రక్తము"** అని ఏసు చెప్పితే క్రైస్తవులు ఏసు శరీరములో ఉండే రక్తమని అనుకొన్నారు. అనేకులకొరకు చిందించు నిబంధన రక్తము అని చెప్పినా, ఆ వాక్యమును తప్పు మార్గములో అర్థము చేసుకోవడము జరిగినది. ఏ విధముగా ఖురాన్ గ్రంథములో (2-187) వ ఆయత్‌లో రాత్రిపూట తినండి, త్రాగండి పగలుపూట ఉపవాస ముండండి. అను వాక్యము మొత్తము ఆయత్‌ను ఎలా తప్పుదారి పట్టించిందో అలాగే 'చిందించుచున్న' అను పదము మొత్తము క్రైస్తవులను తప్పుదారి

పట్టించింది. నేడు క్రైస్తవులలో కూడా ఎంతోమంది మేధావులున్నారు. అయినా వారి మేధాశక్తి ప్రపంచ విషయములలో ఉపయోగపడుచున్నది గానీ, దేవుని వాక్యము విషయములో ఉపయోగపడలేదు. "చిందించుచున్న" అను వర్తమాన కాలములోని వాక్యమును చెప్పినా, దానిని జరిగిపోయిన కాలములోని వాక్యముగా అర్థము చేసుకొన్నారు. ఆ మాట చెప్పినప్పుడు ఏసు సిలువ వేయబడలేదు. ఆయన రక్తము చిందింపబడనూ లేదు. ద్రాక్షరసమును ఇచ్చి ఇది మీ కొరకు మూడు సంవత్సరములనుండి చిందించు నిబంధన రక్తమన్నాడు. నిబంధన రక్తము అనగా బంధములేని జ్ఞానము అనీ, మూడు సంవత్సరములనుండి ప్రజల కొరకు దానిని వెదజల్లు చున్నాడనీ ఆ వాక్యములో చెప్పడమైనది. అక్కడ 'నిబంధన' అను పదమును క్రైస్తవులు పూర్తి వదలివేసి, ఏసు రక్తమును మాత్రము చెప్పుకొంటున్నారు. ఆయన (ఏసు) నా జ్ఞానము వలన మీ పాపములు క్షమించబడుతాయి అంటే, ఆయన రక్తము వలననే మనుషుల పాపాలు పోతాయని చెప్పు కోవడము జరుగుచున్నది. ఈ విధముగా ప్రతి మతములోనూ దేవుని వాక్యమును తప్పుగా అర్థము చేసుకోవడమైనది. క్రైస్తవులు ఏసు చెప్పిన సూక్ష్మమైన జ్ఞానమును స్థూలముగా అర్థము చేసుకోగా, ముస్లీమ్‌లు స్థూల మైన వాక్యమునే స్థూలముగా కూడా సరియైన భావములో అర్థము చేసుకోలేక పోయారు. అలా తప్పు భావములతో అర్థము చేసుకొని దేవుని జ్ఞానమును వక్రమార్గములో ఆచరించితే, జ్ఞానశక్తి ఎలా వస్తుంది? కర్మలెలా కాలి పోతాయి?

దేవుడు మనుషుల కొరకు తన జ్ఞానమును మూడు విధముల తెలియజేసి దానినే మూడు గ్రంథములుగా తయారు చేసి ఇవ్వడమైనది. దేవుడు ప్రత్యక్షముగా ఎవరితోనూ మాట్లాడడు. అందువలన ఒకమారు

ఆకాశవాణి ద్వారా తన జ్ఞానమును చెప్పించాడు. అలా చెప్పిన జ్ఞానము **"జపర"** అను పేరుతో మూడు యుగముల పర్యంతము మనుషుల మధ్యలో మాటల, పాటల రూపములో యున్నా కాలము గడుచుకొలది దానిని ప్రజలు మరచిపోయి తప్పు ఆచరణలయిన యజ్ఞములు చేయుటకు, దానములు చేయుటకు, వేదముల పారాయణము చేయుటకు, తపస్సులు చేయుటకు అలవాటు పడిపోయారు. అటువంటి సందర్భములో దేవుడు భగవంతుడను మారువేషములో వచ్చి, మొదట చెప్పిన జ్ఞానమునే **"భగవద్గీత"** రూపములో భారతదేశమందు చెప్పడమైనది. తర్వాత మూడువేల సంవత్సరములకు ఇశ్రాయేలు దేశమున దేవుడే తిరిగి మారువేషమున వచ్చి తన జ్ఞానమును చెప్పడమైనది. దేవుడు దేవునిగా కాకుండా మనిషివలె మారువేషములో వచ్చి చెప్పుట వలన, దేవుడు మనుషులతో స్వయముగా మాట్లాడినట్లు కాదు. ఈ విధముగా ఒకటి వాణి, రెండు దూతవలె చెప్పగా చివర మూడవ విధానముతో తెరచాటునుండి జిబ్రయేల్‌తో తన జ్ఞానమును చెప్పించడము జరిగినది. తర్వాత ఎప్పుడు జ్ఞానము చెప్పినా, ఈ మూడు విధానాల ద్వారానే చెప్పవలెను. మూడు పద్ధతుల ద్వారానే తన జ్ఞానమును తెలియజేస్తానని **"అంతిమ దైవగ్రంథము"** లో 42వ సూరా, 51వ ఆయత్ నందు చెప్పియున్నాడు.

ఈ విధముగా దేవుడు సృష్ట్యాదినుండి కలియుగము వరకు ఒకమారు, కలియుగములో 5000 సంవత్సరములప్పుడు ఒకమారు, 2000 సంవత్సరములప్పుడు ఒకమారు, 1400 సంవత్సరములప్పుడు ఒకమారు జ్ఞానమును తెలిపి దానినే గ్రంథరూపములో ఇచ్చాడు. కలియుగములో మూడుమార్లు చెప్పిన జ్ఞానమును మూడు గ్రంథములుగా ఇస్తే, మనుషులు దానిని సరిగా గ్రహించలేక, తమను తాము గొప్ప జ్ఞానులుగా తలుచుకొని

మూడు మతాలుగా మారిపోయి, దేవుడు చెప్పిన ఒకే జ్ఞానమును మాదివేరు, మీదివేరనుచున్నాడు. దేవుని ఉద్దేశ్యము తన జ్ఞానమును ప్రజలకు తెలుపాలన్నదే అగుట వలన తన మూడు పద్ధతులలో ఏదో ఒక పద్ధతి ననుసరించి ప్రజల మధ్యలోనికి వచ్చి, చెడిపోయిన తన జ్ఞానమును సవరించుటకు మీరు ఇలా ఇక్కడ పొరపడుచున్నారని, దేవుడు మీరు అనుకొన్న భావములో చెప్పలేదని తెలిపినా, నీవు ఎవరు మా జ్ఞానము చెప్పేదానికి, మా జ్ఞానము మాకు తెలుసు అని మతమును అడ్డము పెట్టుకొని దేవున్నే ధిక్కరించు అజ్ఞాన స్థితికి మనిషి చేరుకొన్నాడు. అయినా పట్టువదలని విక్రమార్కునివలె దేవుడు తన జ్ఞానమును భూమిమీద తప్పక చెప్పిపోతాడు. దానిని గ్రహించినవాడు ధన్యుడు, గ్రహించనివాడు దరిద్రుడు. దేవుని మాటనే ధిక్కరించు వారున్నప్పుడు మేము చెప్పే మాటను వింటారను నమ్మకము లేదు. అయినా నాకు తెలిసిన జ్ఞానమును నేను తెలుపుట నా కర్తవ్యము, నా ధర్మము.

ఈ మధ్య కాలములో 31-7-2015వ తేదీన దేవుని చిహ్నమును గురించి మా ఉపన్యాసము రెండు గంటలసేపు సాగింది. దానిని వినిన వారు బయట చెప్పుకోగా, ఒక ముస్లీమ్ మమ్ములను "ఫేస్‌బుక్"లో విమర్శించడము జరిగింది. ఆయన విమర్శను మా జవాబును క్రింద పొందు పరుస్తున్నాము చూడండి.

**(సందేహం) ఖాదిర్ :- ('ఫేస్‌బుక్' ద్వారా పంపిన మెసేజ్ ఇది) త్రైత సిద్ధాంత ప్రచారకులు దేవుని చిహ్నమును ఖుర్‌ఆన్ వెలుగులో నిరూపించే సాహసం చేసి పెద్ద తప్పు చేశారు. 22వ సూరా 31వ వాక్యము ఇలా ఉంది. "ఏకాగ్రతతో అల్లాహ్ ఏకత్వాన్ని అనుసరిస్తూ ఆయనకు సాటికల్పించకుండా ఉండాలి**

వినండి! అల్లాహ్‌కు సాటి కల్పించేవాడు ఆకాశము నుంచి క్రిందపడిపోయిన వానితో సమానము. ఇప్పుడతన్ని పక్షులైనా తన్నుకు పోతాయి లేదా పెనుగాలి అయినా ఎత్తి దూరప్రదేశంలో విసరేస్తుంది." 32వ వాక్యం ఇలా ఉంది.

"ఇది (అల్లాహ్ ఏకత్వాన్ని అనుసరించడమే సత్యం అయినప్పుడు) అల్లాహ్ చిహ్నాలను ఎవరయినా గౌరవిస్తున్నారంటే అది వారి హృదయాల లోని భక్తి భావనవల్లనే."

గమనిక :- దేవుని చిహ్నాలు అంటే అల్లాహ్ విధేయతను, విశిష్టతను చాటి చెప్పే ఆదేశాలు అన్నమాట. ఇది సూరతుల్ హజ్. ఇందులో హజ్‌కు సంబంధించిన ఆదేశాలు ఇవ్వడము జరిగింది. హజ్ ఆదేశాలలో కాబతుల్లాహ్ తవాఫ్ ఉంది, సఫా-మర్వాల మధ్యన సయీ ఉంది. ఖుర్బానీ ఉంది. కనుక కాబతుల్లాహ్, సఫా-మర్వా పర్వతాలు, ఖుర్బానీ పశువులు ఇవన్నీ దైవచిహ్నాలుగా ఖరారు చేయబడ్డాయి. వీటిని గౌరవించాలి.

త్రైత సిద్ధాంత ప్రచారకుల మానసికస్థితి ఏమిటో 22-31 వాక్యములో ఉంది. ఆ స్థితి ప్రభావమే వారు దేవుడు ఒక్కడే అంటారు. దేవుడు అవతరిస్తాడు అంటారు. ఆ దేవుడే శ్రీకృష్ణుడు అంటారు. దైవప్రవక్త మూసాయే శ్రీకృష్ణుడు అంటారు. 'భగవద్గీత' చదువమంటారు, 'అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో జ్ఞానవాక్యములు' చదువమంటారు. వారి నుదుటిపై ఉన్న నామమును దైవచిహ్నం అంటారు. విగ్రహము వేరు, ప్రతిమ వేరు అంటారు. వీరి విభిన్న నమ్మకాలను హేతుబద్ధంగా ఖండించే వారికి పిచ్చి పట్టింది అంటారు. ఉధృతమైన గాలులు నేలపైని వస్తువులను అటు ఇటూ ఎగరేసుకు పోతాయో, అదే విధముగా వీరు నిజ ఆరాధ్య దైవాన్ని వదలి శ్రీకృష్ణుడే దేవుడు అని నిరూపించే నిరాధరామైన కృషిలో అయోమయానికి గురయ్యారు. ధార్మిక

**జ్ఞానములేని వారిని మార్గభ్రష్టత్వానికి గురి చేస్తున్నారు. 22-31 వాక్యము వెలుగులో వీరి మానసికస్థితిపై జాలివేస్తుంది. అల్లాహ్ వీరికి సత్యాన్ని అవగాహన చేసుకునే సద్బుద్ధిని ప్రసాదించాలని మనము మనసారా ప్రార్థన చేద్దాం,** అని వ్రాశారు. దానికి మా జవాబును చూడండి.

**సందేహ నివారణ :-** దైవగ్రంథములోని దైవవాక్కును ఎక్కడయితే ప్రజలు సరిగా అర్థము చేసుకోలేదో, అక్కడ సరియైన అవగాహన కల్పించి దేవుని వాక్యమును అనుసరించాలను ఉద్దేశ్యముతో మేము కొన్ని వాక్యములకు వివరణ ఇవ్వడము జరిగినది. ప్రపంచమునకంతటికీ ఒకడే దేవుడున్నాడు. వేరే రెండవ దేవుడంటూ ఎవరూ లేరు. ఇంటికి యజమాని ఒక్కడే, సర్వసృష్ఠికీ అధిపతి, అధికారి అయిన దేవుడు ఒక్కడే. ఈ విధానమునే మేము బోధిస్తున్నాము తప్ప వేరే దేవుడున్నాడని మేము ఎక్కడా చెప్పలేదు. భూమిమీద మానవులు తమ అజ్ఞానముతో కొన్ని సమాజములుగా విడిపోయారు. ప్రజలు ఎన్ని సమాజములుగా ఉండినా అందరికీ దేవుడు ఒక్కడే. అయితే కొన్ని సమాజములు ఆ మాటను ఒప్పుకొంటున్నాయి. కొన్ని సమాజములు ఒప్పుకోక వారి అజ్ఞానముతో దేవున్ని అనేక రూపములుగా, పేర్లుగా చెప్పుకొంటున్నారు. 'దేవుడు ఒక్కడే' అనువారికి మా బోధలతో పనిలేదు. ఎందుకనగా వారు సత్యమును తెలిసియుండుట వలన వారికి మేము చెప్పనవసరము లేదు. భూమిమీద దేవుడు ఒక్కడే కాదు అను వారికీ దేవుడు ఒక్కడే అని చెప్పుచూ, ఆ దేవుడు చెప్పిన దైవవాక్యములను సరిగా అర్థము చేసుకోలేని వారికి దేవుని జ్ఞాన ఔన్నత్యమును తెలుపు నిమిత్తము మేము **"భగవద్గీతను"** వివరించాము. మేము చెప్పిన వివరమును అర్థము చేసుకోలేని హిందువులు మమ్ములను హిందువేకాదు, హిందువుగావుండి భగవద్గీత ముసుగులో ఇతర మతములను

ప్రచారము చేయుచున్నారని ఆరోపణ చేశారు. హిందువుల నుండి చాలా వ్యతిరేఖత వచ్చింది. అక్కడ గీతలో దేవుని ఏకత్వమును దానికి సంబంధించిన జ్ఞానమునే చెప్పాము. అందులో మేము దేవుని ఆజ్ఞ ప్రకారమే నడుచుకొన్నాము, దేవుడు అందించిన జ్ఞానమునే తెలిపాము. మేము చెప్పిన జ్ఞానములో హేతుబద్ధతవుంది, దానికి తగిన శాస్త్రబద్ధత వుంది.

కొంతకాలమునకు హిందూమతములోని కొందరు జ్ఞానులు మేము వ్రాసిన భగవద్గీతను చదివి, దానిలోని జ్ఞాన వివరమును చూసి సంతోష పడినవారై, వారంతా మావద్దకు వచ్చి "ఇందూ జ్ఞానవేదిక" అను ఒక సంఘమును తయారు చేసుకొని, మేము చెప్పిన జ్ఞానమునే ఉత్తమమైనదిగా ప్రచారము చేయుచున్నారు. నేను ముఖ్యముగా చెప్పునది ఏమనగా! నేను పుట్టుకలో హిందువుగా పుట్టినా, నాకు మతము ముఖ్యముకాదు, దేవుని జ్ఞానమే ముఖ్యము. ఎందరో దేవుని కొరకు, దేవుని జ్ఞానము కొరకు తపించువారు అన్ని మతములలో ఉన్నారు. వారికి దేవుడు అందించిన జ్ఞానము తెలియకున్నదని, అటువంటివారికి దేవుని జ్ఞానము అంటే ఏమిటో తెలుపాలని, మేము ఖురాన్ గ్రంథములోని కొన్ని వాక్యములకు వివరము వ్రాయడము జరిగినది. ఇస్లామ్ సమాజములో 'దేవుడు ఒక్కడే' అను గాఢ విశ్వాసము అందరికీ కలదు. దేవుని ఏకత్వము మీద విశ్వాసము గల వారిలో ముస్లీమ్‌లు మొదటివారు. 'దేవుడు ఒక్కడే' అని వారికి వేరే చెప్పనవసరములేదు. అయితే ఆ ఒక్క మాటయే ప్రజలకు అవసరమైతే, అల్లా అంతపెద్ద ఖురాన్ గ్రంథమును చెప్పనవసరమే లేదు. అయితే ఖురాన్ గ్రంథములోని వాక్యములు కొంతమంది మత పెద్దలయిన వారికి తప్ప మిగతా వారికి తెలియవు. దేవుని వాక్యములు ముస్లీమ్‌లలో కొందరికి తెలుపవలెనను ఉద్దేశ్యముతోకాక, మిగతా హిందువులు, క్రైస్తవులు కూడా అంతిమ దైవ గ్రంథమయిన ఖురాన్‌లోని జ్ఞానము యొక్క రుచి తెలియాలను

ఉద్దేశ్యముతో, మేము **"అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు"** అను గ్రంథమును వ్రాయగా దానిని కొందరు ముస్లీమ్‌లు చూచి సంతోషించి వారి సంఘము ద్వారా ప్రచురణ చేశారు. **"ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ"** ద్వారా ఆ గ్రంథమును ప్రచురించారు. ఆ సంఘము కోరిక మేరకు మేము ఇంకా కొన్ని గ్రంథములు వ్రాసి ఇవ్వడము జరిగినది. అయితే ముస్లీమ్ పెద్దలు అన్ని విధముల మా బోధలు బాగున్నాయనీ, దేవునికిగానీ, ఖురాన్ గ్రంథమునకుగానీ, ఎక్కడ వ్యతిరేఖముగా లేవని చెప్పుచుండగా, కొందరు మా గ్రంథములోని జ్ఞానమును అర్థము చేసుకోలేక ముందు చూపులేకుండా, వారి చూపు పరిధిలో మా రచనలను తప్పు పట్టుచున్నారు. మేము చెప్పు దానిని ఓపికగా చదువగలిగితే వారు కూడా తప్పక ఒప్పుకోగలరు. **మేము చెప్పునది నేటికీ రేపటికి ఎప్పటికీ సత్యము** గనుక అందరూ ఈ దారికి రావలసిందే, తప్పక వస్తారని ఆశిద్దాము.

నేను ఒక మతగురువును కాను. నేను దేవుని వాక్యమును వివరించి వినిపించుటకు వచ్చిన వానిని మాత్రమే. అందరూ నా మాటనే వినవలెనని చెప్పలేదు. దేవుడు మిమ్ములను ఎటు నడిపిస్తే అటు పోగలరు. నా బోధలను వినిన క్రైస్తవులు నా దగ్గరకు వచ్చి బైబిలు గ్రంథములోని కేవలము నాలుగు సువార్తల జ్ఞానమును వినగలిగారు. మేము చెప్పిన తర్వాత సువార్తల వాస్తవ జ్ఞానము తెలిసిందని సంతోషపడి క్రైస్తవులలో కొందరు **"సువార్త క్రైస్తవ సంఘము"**ను స్థాపించి ఆ సంఘము ద్వారా మేము చెప్పిన జ్ఞానమును గ్రంథరూపములో ప్రచురించి ప్రచారము చేసు కొంటున్నారు. ఒకప్పుడు మా బోధలను వ్యతిరేఖించిన మూడు మతముల వారు తర్వాత మా బోధలలోని వాస్తవిక సత్యమును గ్రహించి, ఇదియే సరియైన జ్ఞానమని నేడు ప్రచారము చేయుచున్నారు. దైవగ్రంథములయిన భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలోని దేవుని జ్ఞానమునకు మేము

ఎక్కడా వ్యతిరేఖముగా చెప్పలేదు, వ్రాయలేదు. మా బోధలలో హేతుబద్దత, శాస్త్రీయత రెండూ గలవు. దేవుని వాక్యమునకు విరుద్ధముగా వ్రాసినా, చెప్పినా దేవుడు, దేవదూతలు అందరూ శపించగలరు. అంతేకాక పాపములలో పెద్దపాపము వచ్చునని ఖురాన్ గ్రంథము (2-161) ఆయత్‌లో దేవుడే చెప్పాడు. దేవుని జ్ఞానమునకు విరుద్ధముగా మాట్లాడు వానికి ఈ యుగమందైననూ, రాబోవు యుగమందైననూ పాపక్షమాపణ లేదని బైబిలులో మత్తయి సువార్త 12వ అధ్యాయమందు 32వ వాక్యములో చెప్పి యున్నారు. ఇంకనూ భగవద్గీతలో దైవాసుర సంపద్విభాగ యోగము అను అధ్యాయములో 20వ శ్లోకమందు దేవుని జ్ఞానమునకు వ్యతిరేఖమయిన వానిని, తప్పు భావములు చెప్పువానిని అజ్ఞానులుగా పుట్టించి జన్మజన్మకు అధోగతిపాలు చేసి, నా జ్ఞానము యొక్క గట్టు దొరకకుండా చేస్తానని దేవుడు చెప్పాడు. ఇవన్నీ తెలిసిన మేము తప్పు భావమున్న చోట సవరించి, విశధీకరించి చెప్పి మిగతా ప్రజలను అజ్ఞాన మార్గములో పోకుండా తెలియ చెప్పాలనుకొన్నాము.

నేడు మేము మూడు గ్రంథముల జ్ఞానమును గ్రంథరూపములో వ్రాశాము. అలా వ్రాయడము వలన ఏ గ్రంథములో ఏమి చెప్పారో ప్రతి మతమువారికి తెలియునట్లు చేశాము. మేము వ్రాసిన **"అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు"** అను ఖురాన్ గ్రంథములోని జ్ఞానమును పదివేలమంది హిందువులు చదువగలిగారు. చదివిన వారు ఖురాన్‌లో ఇంత గొప్ప జ్ఞానముందా! అని ఆశ్చర్యపోతున్నారు మరియు దానిని చూచి సంతోషపడుచున్నారు. అయితే కొందరు దురదృష్టవశాత్తు మా జ్ఞానమును పూర్తి చూడకుండా, మేము ఏమి చెప్పుచున్నామో దానిని గ్రహించకుండా, మాకు వ్యతిరేఖముగా మేము అజ్ఞానమును బోధించునట్లు తలచుచున్నారు. ప్రస్తుతము మేము అంతిమ దైవగ్రంథములో సూరా 22, ఆయత్ 32లో

గల, మరియు సూరా 5 ఆయత్ 2 లో గల సమాచారము ప్రకారము దేవుని చిహ్నమును గురించి వ్రాయుచున్నాము. మేము వ్రాసిన వివరము సెప్టెంబరు నెల 2015లో బయటికి రాగలదు. అయితే మేము ఏమి చెప్పుచున్నామో చూడకనే, మా భావమును చదువకనే మమ్ములను విమర్శించు వారుండడము దురదృష్టము. అయినా నా మాటను మీరు ఆచరించమని మేము చెప్పలేదు. దేవుడు నాకు తెలిపినదే మీకు తెలుపుచున్నాను. ఒకవేళ మీకు నచ్చితే నా మాటను వినండి, నచ్చకపోతే గాలికి వదలి వేయండి. నేను వ్రాయునది ముస్లీమ్ సమాజము తెలియాలని కాదు. ముఖ్యముగా ఖురాన్ గ్రంథములో ఏమున్నదో, క్రైస్తవ సమాజము, హిందూ సమాజము తెలియాలని వ్రాయుచున్నాము.

దైవవాక్కులను దేవుని గౌరవమునకు భంగము కలుగకుండా ఇతరులకు తెలియజేయాలనునదే మా ఉద్దేశ్యము. అయినా నన్ను విమర్శించు వారిని మిమ్ములను మీరు దేవుని జ్ఞాన విషయములో సంపూర్ణముగా తెలిసినట్లు అనుకొంటున్నారు అది నిజమో, కాదో వెను దిరిగి చూచుకోండి, అట్లు చూచుకోవడములో తప్పులేదు కదా! అని అడుగు చున్నాను. దేవుని చిహ్నములు మీరు చెప్పుకొన్నవేగానీ, దేవుడు వాటిని గురించి ఎక్కడా చెప్పలేదని జ్ఞాపకము చేసుకోండి. మీరు చెప్పునవి మీ భక్తిచిహ్నాలా లేక దేవుని చిహ్నాలా? ఒకమారు చూచుకోండి. మేము కృష్ణున్ని దేవుడని చెప్పలేదు, భగవంతుడని చెప్పాము. దేవునికి భగవంతునికి ఎంతో తేడా ఉన్నప్పుడు దేవుడని మేమెలా చెప్పగలము. విగ్రహమువేరు, ప్రతిమవేరు అయితే వీటిని దేవుడని మేము చెప్పలేదే! దేవుని చిహ్నము అంటే దేవునికి సంబంధించినదిగా ఉంటుందిగానీ, దేవునికి అర్పించు ప్రపంచ వస్తువులను, పనులను, పశువులను దేవుని చిహ్నములుగా చెప్పడము సమంజసమా? అవన్నియూ మనిషి యొక్క భక్తి చిహ్నములని

చెప్పవచ్చును. నన్ను విమర్శించేముందు మీకు తెలిసిన జ్ఞానమును దేవుడు ఒప్పుకొంటాడని మీరు ఎలా అనుకొంటున్నారు? 2-187 ఆయత్‌ను పూర్తి చదివి చూడండి. అక్కడ మీరు పొరపడినారో లేదో తేల్చుకోండి, అలాగే సూరా 6-91 ఆయత్ వాక్యము యొక్క పూర్తి వివరము తెలియునేమో మిమ్మల్ని మీరు ప్రశ్నించుకోండి. నాకు చెప్పవలసిన అవసరములేదు మీరు తెలిసిందని తృప్తిపొందితే చాలు. అట్లే 6-95, 6-98 ఆయత్‌లకు వివరము తెలిసియుంటే మేము కూడా సంతోషిస్తాము. తెలియదని మీకు అర్థమయితే దాని వాస్తవ జ్ఞానము అల్లాహ్‌వద్దనే వున్నది కాబట్టి తెలుపమని అల్లాహ్‌నే వేడుకోండి. తెలియనప్పుడు నాకు తెలుసునని అనుకోకు, దేవుడు ఒప్పుకోడు.

చివరిగా మేము అడుగునది ఏమనగా! సూరా 22-31వ వాక్యము ప్రకారము ఆకాశమునుండి క్రిందపడినవారిని గురించి మీరు చెప్పారు. అల్లాహ్ క్రిందికి తోస్తే ఎవరయినా క్రిందపడవలసిందే. అయితే ఇక్కడ అల్లా చెప్పిన వాక్యములో **'ఆకాశము'** అంటే ఏమిటో మీరు అర్థము చేసుకొన్నారా? అని అడుగుచున్నాము. క్రిందపడిన వానిని ఆకాశములో యున్న పక్షులుగానీ, గాలిగానీ ఎగరేసుక పోతుందని వాక్యములో కలదు. ఆకాశములో యున్న మనిషిని ఆకాశములో నివసించు పక్షులు, గాలి ముందే తన్నుకొని పోకుండా క్రిందపడిన వానినే తీసుకొనిపోవుటకు కారణము ఏమి? ఆకాశపక్షులు, గాలి అంటే వివరము తెలియునా? అల్లాహ్ సూక్ష్మముగా చెప్పిన జ్ఞానమును స్థూలముగా లెక్కించుకోవడమే పొరపాటు. అట్లయినా స్థూలముగా మనుషులను పక్షులు ఎత్తుకపోవడము జరిగే పనేనా?

సూరా 15-29వ ఆయత్‌లో **"దేవుడు ఒక మనిషి బొమ్మను చేసి అందులో తన ఆత్మనే ఊదినప్పుడు తయారయిన వానిముందు దేవ దూతలందరూ సాష్టాంగపడినారు, మనుషులయిన మీరు కూడా సాష్టాంగ**

**నమస్కారము చేయండి"** అని అల్లాయే జిబ్రయేల్ ద్వారా చెప్పితే, మేము అల్లాకు తప్ప ఎవరికీ మ్రొక్కము అనడము అల్లా మాటను ధిక్కరించినట్లు కాదా! అల్లా జ్ఞానమును అనుసరించినట్లగునా? మేము ఎక్కడయినా అల్లా మాటను కాదన్నామా? అల్లా విషయములో తప్పు చేస్తే మాదయినా తప్పేయగును. దేవుని విషయములో మేము తప్పు చేయకూడదనే భావములోనే ఉన్నాము. మేము ఎక్కడయినా తప్పుచేస్తే తప్పునిసరిగా మాకు తెలుపండి. మేము దేవునికి భయపడువారమైనందున మా తప్పును మేము సరిచేసుకోగలము.

**అబ్దుల్ ఖాదిర్ ఉమారి అను వ్యక్తి ఆయన పంపిన విమర్శలకు కొన్నింటికి మేము ఇలా జవాబిచ్చుచున్నాము.** మేము కొంతవరకైనా జవాబు ఇవ్వకపోతే మేమే తప్పుచేసిన వారిగా బయటికి కనిపించు అవకాశము కలదు. మేము దేవునిమార్గములో సక్రమముగా ఉన్నప్పుడు మమ్ములను ప్రశ్నించువారు ఎక్కడ పొరపడినది మేము చెప్పక తప్పదు.

**ప్రశ్న :-** దివ్య ఖుర్ఆన్ 1400 సంవత్సరముల పూర్వము విశ్వప్రభువైన అల్లాహ్ తరపునుండి అంతిమ దైవ ప్రవక్త ముహమ్మద్ పై అవతరించిన చిట్ట చివరి గ్రంథము.

**మేము :-** దివ్య ఖుర్ఆన్ గ్రంథము 1400 సంవత్సరములప్పుడు జిబ్రయేల్ ఆకాశమునుండి వచ్చి చెప్పగా ప్రవక్తగారు 23 సంవత్సరములు వినగలిగారు. 23 సంవత్సరముల తర్వాత, ప్రవక్తగారు చనిపోయిన తర్వాత, కొంతకాలానికి ఖుర్ఆన్ గ్రంథరూపమైనది. ఖుర్ఆన్ దైవగ్రంథమే అయినా ఏదీ స్వయముగా అవతరించలేదు. ఖురాన్ పేరుకు అంతిమ దైవగ్రంథమే అయినా అది తనకంటే ముందు 3600 సంవత్సరములు ముందు పుట్టిన ప్రథమ దైవగ్రంథమయిన **'తౌరాత్'** గ్రంథములోని జ్ఞానమునే ధృవీకరించి

చెప్పింది. ఆ విషయము తెలియుటకు ఖురాన్‌లో (5-43, 5-44, 5-46, 5-48, 5-68, 62-5) ఆయత్‌లను చూడండి.

**ఖాదిర్ :-** ఏసువారు ప్రభువు అనీ, దేవుని కుమారుడు అనీ, పరిశుద్ధాత్మయనీ పాపుల కొరకు సిలువపై మరణించాడని మీరు నమ్మి మీ పరలోక జీవితమును నాశనము చేసుకోవద్దండి.

**మేము :-** ఇది పూర్తి మతద్వేషముతో చెప్పుమాటగా ఉన్నది. ఏసును గురించి మీకు తెలిసింది అంతే, ఆయన ఎవరో, ఎక్కడినుండి వచ్చాడో, ఎక్కడికి పోయాడో ఆయన వెనుకయున్న రహస్యమేదో మాకు క్షుణ్ణముగా తెలుసు. అందువలన మీ మాటను జ్ఞానమున్న మాటగా లెక్కించక మతము వైపునుండి మాట్లాడు మాటగా చెప్పుచున్నాము.

**ఖాదిర్ :-** మీ దృష్టిలో స్వర్గనరకాలిక్కడే ఉన్నాయా? నిజదైవాన్ని నమ్మి, ఆయన జ్ఞానము ప్రకారము జీవించువారు చీకుచింతలేకుండా జీవిస్తున్నారని మీరు భావిస్తున్నారా? హంతకులు, కామాంధులు, దుర్మార్గులు, అవినీతి పరులు ఇక్కడ కష్ట జీవితమును అనుభవించుచున్నారని మీరు నమ్ముచున్నారా? చూడబోతే ఇక్కడ సజ్జనులు కష్టాలపాలగుచున్నారు. దుర్జనులు విలాసవంతమైన జీవితము గడుపుచున్నారు?

**మేము :-** స్వర్గ నరకాలు ఇక్కడే ఉండుట ముమ్మాటికీ నిజము. జ్ఞానులు, సజ్జనులు కష్టాలపాలగుట, దుర్జనులు సుఖముగా జీవించుట జరుగుచున్న సత్యమే. మనిషి గతజన్మలో చేసుకొన్నది ఈ జన్మలో అనుభవించుచున్నాడు. ఈ జన్మలో చేసుకొన్న ఫలితమును వచ్చే జన్మలో అనుభవిస్తాడు. ఈ విషయమై అంతిమ దైవగ్రంథములో ఇలా వ్రాయబడివుంది చూడండి. (54-52,53) **(52) " వీరు చేసేదంతా కర్మపత్రాలలో నమోదైవుంది.", (53) "అలాగే ప్రతి చిన్న పెద్ద విషయము వ్రాయబడివుంది." (41-46) "ఏదయినా సత్‌కార్యము చేస్తే అది తనకు మేలు చేస్తుంది. మరి ఏదయినా**

**దుష్కార్యము చేస్తే దాని పాప ఫలితము అతని మీదే పడుతుంది. నీ ప్రభువు మాత్రము దాసులకు అన్యాయము చేసేవాడు కాదు." (57-22) "మనిషికి వచ్చు ఏ ఆపద అయినా సరే, అది భూమిలో వచ్చినదయినా, స్వయానా మీ ప్రాణము మీదికి వచ్చినదైనా నిన్ను పుట్టించకముందే అదొక ప్రత్యేక గ్రంథములో వ్రాయబడి ఉన్నది. అలా చేయుట అల్లాకు చాలా తేలిక."** ఇక్కడ ఈ ఆయత్‌లను చూచిన తర్వాత మనుషులకు కర్మను గురించిన వివరము సరిగా అర్థముకాలేదని తెలియుచున్నది. భూమిమీద దేవునికి తెలియకుండా ఏమీ జరుగదు. ఒక సజ్జనుడు కష్టాల పాలైనా, ఒక దుర్జనుడు సుఖాలపాలైనా అది వాడు పుట్టకముందు గతజన్మలో నమోదయినదని, దానిప్రకారమే ఇప్పుడు మంచివానికయినా కష్టాలు రావచ్చునని తెలియాలి. పునర్జన్మ విషయమును నమ్మనివారు కర్మల విషయమును తెలియలేరు. మేము వ్రాసిన **"పునర్జన్మ రహస్యము"** అను గ్రంథమును చదవండి. మీరు నేర్చుకోవలసింది ఖురాన్ గ్రంథమునుండి గ్రహించవలసినది ఎంతోవుంది.

**ఖాదిర్ :-** ఇది మీరు నమ్ముతారా? బైబిలు గ్రంథములో మత్తయి సువార్త 10-34లో ఇలా వుంది. నేను భూమిమీద సమాధానమును పంపవచ్చితినని తలచకు ఖడ్గమునేగానీ సమాధానమును పంపుటకు నేను రాలేదు. ఏసువారు ఖడ్గాన్ని ఎందుకు ప్రస్తావించారు?

**మేము :-** మేము ఎందుకు నమ్మము! ఆ వాక్యము అర్థము కానివారికి ఏసు హింసను రేకెత్తించినట్లుంది. అర్థమయినవారికి అందులో ఎంతో జ్ఞానమున్నది. ఖడ్గము అనగా నరికివేయునది. ఏసు ప్రస్తావించిన ఖడ్గము సాధారణ ఖడ్గముకాదు. అది జ్ఞానఖడ్గము. మనుషులు కోరే కోర్కెలను నెరవేర్చి వారిని సమాధానపరచుటకు ఏసు రాలేదు. ఆయన భవబంధము లను త్రెంచివేయునది, పాప ఖండన చేయు జ్ఞానఖడ్గమును ప్రజలకు

ఇచ్చుటకు వచ్చాడుగానీ, ప్రజల కోర్కెలను, ప్రార్థలను నెరవేర్చుటకు రాలేదు. ప్రపంచ సంబంధ కోర్కెలను వాని కర్మలను వదలివేసి, వాని కర్మలను ఖండించు జ్ఞానఖడ్గమును ఇచ్చేదానికి ఏసు వచ్చాడని మీరెందుకు అనుకోలేదు?

**ఖాదిర్ :-** లూకా సువార్త 12-49లో ఇలా వుంది. "నేను భూమిమీద అగ్నివేయ వచ్చితిని. అది ఇదివరకే రగులుకొని మండవలెనని ఎంతో కోరుచున్నాను" ఏసువారు మానవ సముదాయములో చిచ్చుపెట్టడానికి వచ్చాడని మీరు నమ్ముతారా?

**మేము :-** దొంగకు దొంగచింత, వ్యభిచారికి వ్యభిచారిచింత అన్నట్లు అగ్గి అంటూనే బయటి అగ్ని అని ఎందుకు అనుకోవాలి? జ్ఞానాగ్ని అని ఎందుకు అనుకోకూడదు. ఇప్పటికే జ్ఞానాగ్ని మనుషులలో ప్రజ్వరిల్లి జనులు కర్మలను కాల్చుకోవాలని ఏసు కోరుకొన్నాడు.

**ఖాదిర్ :-** దివ్య ఖురాన్ దైవగ్రంథమా లేక బైబిలా ఏది? ముస్లీమ్ విశ్వాసాల ప్రకారము జబూర్, తౌరాత్, ఇంజీలు దైవగ్రంథములు గలవు. ఖురాన్ పూర్వ గ్రంథాలను ధృవపరుస్తుంది. ఆయా గ్రంథాలలోవున్న సత్య సందేశాన్ని బలపరుస్తుంది.

**మేము :-** దివ్య ఖురాన్, పరిశుద్ధ బైబిలు, పవిత్ర భగవద్గీత మూడు దైవ గ్రంథములే 'తౌరాత్, ఇంజీల్‌లను ఖురాన్ బలపరుస్తుంది' అని మీరే చెప్పారు. ఇంజీలు అంటే బైబిలు అనీ, తౌరాత్ అంటే భగవద్గీతయని మీకు తెలియదా? జబూర్ అనునది గ్రంథముకాదు. గ్రంథముగా వ్రాయ బడని దైవబోధను జబూర్ అంటారు. ఇది తెలియాంటే వెనుకటి చరిత్రను తెలిసియుండాలి. ఎవరో చెప్పితే వినకూడదు.

**ఖాదిర్ :-** దివ్య ఖురాన్‌లో అనేకమార్లు ఈ గ్రంథము సమస్త లోకాల ప్రభువు అయిన అల్లాహ్ తరపునుండి అవతరించింది అని చెప్పడము

జరిగింది. కానీ బైబిలు అవతరించిన గ్రంథము అని ఒక్కచోట కూడా ప్రస్తావన లేదు. పైగా దానిని రచన అని అన్నారు.

**మేము :-** దివ్య ఖురాన్ గ్రంథమును మహాజ్ఞాని అయిన జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తగారికి 23 సంవత్సరములు చెప్పడమైనది. అవతరించడము అంటే ఒక్కమారుగా పుట్టడము లేక రావడము అని అర్థము. బైబిలు గ్రంథమును మనుషులు చెప్పినా అందులో నాలుగు సువార్తలను స్వయముగా ఏసు చెప్పాడు. ఏసు చెప్పిన నాలుగు సువార్తలను నలుగురు వ్యక్తులు వ్రాశారు. అక్బరుచక్రవర్తి మారువేషములో సంచరించినట్లు దేవుడు తన మారువేషములో భూమిమీద సంచరించినప్పుడు ఆయనను 'దేవుడు' అని అనకూడదు. **'దేవుడు అవతరిస్తాడు'** అని ఖురాన్‌లో సూరా 89-21,22 ఆయత్‌లలో చెప్పడమైనది. దేవుడు దేవునిగా భూమిమీద అవతరించక భగవంతునిగా అవతరిస్తాడు. కృష్ణుడు, ఏసు రెండు జన్మలు భగవంతుని జన్మలే. వారు మనుషులవలె కనిపించినా మనుషులు కాదు, అట్లని దేవుడు కాదు. మనిషికాక దేవుడుకాక మధ్యలో భగవంతునిగా మాత్రముందురు. భగవంతుడు వేరు, దేవుడు వేరు.

**ఖాదిర్ :-** విగ్రహారాధన మూర్ఖత్వము అంటుంది భగవద్గీత, విగ్రహారాధన దేవుని ఆగ్రహానికి గురి చేస్తుందని బైబిలు అంటుంది. క్షమించరాని నేరము అటుంది దివ్య ఖురాన్. విగ్రహారాధన పట్ల మీ అభిప్రాయము ఏమి?

**మేము :-** విగ్రహారాధనను వ్యతిరేఖించడములో మీకంటే ముందు మేమున్నాము. అయితే ప్రతిమను గౌరవిస్తాముగానీ, ప్రతిమను దేవుడని మేము ఎక్కడా చెప్పలేదు. భగవంతుని ప్రతిరూపమును ప్రతిమ అంటారు. భూమిమీద భగవంతుని అవతారములు రెండే కలవు. ఒకటి శ్రీకృష్ణుడు, రెండు ఏసు. ఏసును క్రైస్తవులు కూడా ప్రతిమగా ఉంచుకోరు. దానివలన కృష్ణుని ఆకారము ఒక్కటి మాత్రమే ప్రతిమయగును. ప్రతిమ కూడా

మనుషుల చేత చేయబడినా, విగ్రహమువలె బొమ్మగాయున్నా, ప్రతిమకు విగ్రహమునకు ఎంతో తేడా గలదు. ప్రతిమలో దేవతలుండరు. విగ్రహములో దేవతలు సజీవముగా ఉంటారు. భూమిమీద దైవజ్ఞానమును అనుసరించి ఆకారముగల ప్రతిమ భగవంతుని గుర్తు. ఆకారములేని లింగము దేవుని గుర్తు. లింగము ప్రతిమ కూడా కాదు. దానికి ఆకారమే లేదు.

**ఖాదిర్ :-** దివ్య ఖుర్ఆన్ (3-7) వాక్యములో ముతషాబిహాత్ వాక్యాల విషయములో హృదయాలలో వక్రతయున్నవారు విపరీత తాత్పర్యములు తీసుకుంటారు అని కలదు. దీనికేమంటారు?

**మేము :-** దేవుడు తన గ్రంథములో ముతషాబిహాత్ వాక్యములున్నట్లు చెప్పడము వాస్తవమే. కొందరు వక్రబుద్ధియున్నవారు వాటికి విపరీత అర్థాలు చెప్పెదరని చెప్పినమాట నిజమే. వక్రబుద్ధియున్నవారి మాట వినవద్దు అని చెప్పాడుగానీ, ఆ వాక్యములను తెలుసుకోకుండా వదలి వేయమని చెప్పలేదే. అదే వాక్యములో బుద్ధి, శ్రద్ధయున్నవాడు నా బోధను గ్రహించగలడు అని కూడా చెప్పాడని మరచిపోకూడదు. ముతషాబిహాత్ వాక్యముల జోలికి మేము పోము అవి మాకు అవసరములేదు అని అంటే ఖురాన్ జ్ఞానము సగముకు పైగా తెలియదనియే అర్థము. సూక్ష్మవాక్యముల వివరము దేవునికి తప్ప మానవులకు తెలియదని అక్కడే చెప్పారు కదా, మానవుడుకాని మానవునివలె యున్నవాడు వచ్చి చెప్పినా విననివాడు ముందుకు పోలేడు. జ్ఞానికాలేడు.

**ఖాదిర్ :-** ప్రతిమవేరు, విగ్రహమువేరని, కృష్ణుని ప్రతిమ భగవంతుడని, చిల్లర దేవుళ్ళ విగ్రహము కాదని సత్యాన్ని అసత్యముతో కలిపి సామాన్య జనమును ఎందుకు తికమక పెట్టుతారు? మీ ఉద్యమము వలన మీ పరలోక జీవితమును నాశనము చేసుకోకండి?

**మేము :-** చిల్లర దేవుళ్ళు విగ్రహముకాదని మేము ఎక్కడా చెప్పలేదే! పైగా చిల్లర దేవుళ్ళను మ్రొక్కవద్దనే చెప్పుచున్నాము. మీకు దేవుడు అంటే మొండి గుర్తుగా తెలుసుగానీ, దేవుని యొక్క పూర్తి వివరము తెలియదు. దేవునికి ప్రాథమిక ధర్మము ఒకటి గలదు దానిని ఎవరూ అతిక్రమించ కూడదు. **"రూప, నామ, క్రియలు లేనివాడు దేవుడు"** అనునది దేవుని ముఖ్య ధర్మము. రూపమున్నవాడు, పేరు కల్గినవాడు, పని చేయువాడు దేవుడు కాదని మేము మొదటినుండి చెప్పుచున్నాము. మీకు అర్థముకాక తికమక పట్టిపోతున్నారు. రూపము, పేరు, కార్యములు గల కృష్ణుడు భగవంతుడు మాత్రమే. తల్లిగర్భమును భగము అంటాము. భగమునుండి పుట్టినవాడు ఎవడైనా భగవంతుడేయగును. తల్లిగర్భమునుండి పుట్టినవాడు కృష్ణుడు, ఏసు తప్ప భూమిమీద ఎవరయినా ఉన్నారేమో చూపగలరా? ప్రతిమాట శాస్త్రబద్ధముగా ఉండవలెనని ఖురాన్ గ్రంథములో సూరా 40, ఆయత్ 35లో **"వారు తమవద్దకు వచ్చిన ఏ ప్రమాణము లేకుండానే అల్లాహ్ నిదర్శనాల విషయములో మొండిగా మాట్లాడుదురు"** అని గలదు. ఆ విధముగానే మీరు ప్రతి చోట గ్రంథ ఆధారము లేకుండా మాట్లాడు చున్నారు. ప్రతి ఒక్కరూ మేము తల్లిగర్భమునుండే పుట్టాము కదా! అని అనుకుంటున్నారు. అది వాస్తవమో కాదో చూచుకోండి. ప్రపంచములో దేవుడు తప్ప ఎవడూ భగవంతునిగా తల్లిగర్భములో పుట్టే అవకాశమే లేదు, ఇది శాసనము.

**ఖాదిర్ :-** దివ్య ఖురాన్ సూరా 50, ఆయత్ 21వ వాక్యములో "తోలేవాడు, సాక్ష్యమిచ్చేవాడు" అని వుంది. మీరు సత్యాన్వేషకులైతే 18 నుండి 30 వాక్యము వరకు ప్రశాంతముగా చదవండి. సత్యము ఏమిటో మీకే తెలుస్తుంది.

**మేము :-** మెదడులో 'నాకు తెలిసినది ఇతరులకు తెలియదను' భావ

మున్నంత వరకు ఎవరూ ఏది గ్రహించరు. మేము వాక్యము చదువుతూ వుంటే కళ్ళ ముందర దృశ్యము కనిపించినట్లు దానిలోని భావము కనిపించుచుండును. మేము నేర్చుకోవలసినది, కూర్చుకోవలసినది ఏమీ లేదు. నా విషయము అటుంచి 18 నుండి 30 వాక్యములను చదివితే అన్నీ అవసరము లేదుగానీ, 20వ వాక్యములో **"పునరుత్థాన దినము"** అని చెప్పబడినది. 19వ వాక్యములో **"మరణము"** గురించి చెప్పారు. మరణములో ఏమి జరుగునో మీకు తెలియునా? తిరిగి లేపబడే **'పునరావృత్త దినము'** అంటే ఏమిటో, అది ఎప్పుడు వస్తుందో మీకు తెలియునా? ఈ రెండింటిలో కొంతయినా ప్రత్యక్ష అనుభవముందా? లేక ఇతరులు చెప్పే దానినిబట్టి మీరు చెప్పుచున్నారా? ఒక్కమారు మీ గుండెమీద మీ చేయి వేసుకొని వాస్తవముగా మీకు ఏమి తెలుసో చూచుకోండి. మేము వ్రాసిన **"జనన మరణ సిద్ధాంతము"** చదవండి. మరణమంటే ఏమిటో తెలుస్తుంది. ప్రళయకాలములో మనుషులు తిరిగి లేపబడుతారని ఖురాన్ గ్రంథములో గలదు. ఖురాన్ స్వచ్ఛమైన దైవగ్రంథము. అది అంతా సత్యసమేతముగా యున్నది. అందులో చెప్పిన ప్రళయ కాలమును ఇంతవరకు ఎవరూ అర్థము చేసుకోలేదని తెలిసిపోయింది. ప్రళయములో సమాధులనుండి లేపబడుతారు అన్న మాట వాస్తవమే. **"సమాధి"** అంటే ఏమిటో తెలుసా? మనిషిని పూడ్చబడిన గుంతలు సమాధులయితే, మనిషిని పూడ్చకుండా జంతువులు అడవిలో తినేశాయనుకో, అప్పుడు ఏ సమాధినుండి లేపుతారు? వాడు ఎక్కడినుండి లేస్తాడు? ప్రమాదవశాత్తు అగ్నిలో కాలి బూడిద అయిపోయి బూడిద కూడా వర్షములో కరిగి పోయిందనుకో, అట్టివాడు ఎక్కడినుండి లేచివస్తాడు? దేవుడు ఎదురాడని జ్ఞానమును మనుషులకు ఇస్తే, మనుషులు ప్రశ్నకు జవాబులేని జ్ఞానమును చెప్పి, దేవుని మాటను అగౌరవపరుస్తున్నారు. చావు అంటే ఏమిటో? సమాధి అంటే ఏమిటో

తెలియకుండా, మీరు సత్యము తెలుసుకోకుండా, మమ్ములనే సత్యము తెలుసుకోమంటున్నారు. నాకు తెలిసిన సత్యము తెలిసిందిగానీ, నా ప్రశ్నలకు మీరు జవాబు శాస్త్రబద్ధముగా చెప్పగలరా? శాస్త్రబద్ధముగా చెప్పాలంటే చావులో ఏమి జరుగుతున్నదో, పుట్టుకలో ఏమి జరుగుచున్నదో తెలిసియుండాలి. అప్పుడే సమాధి అంటే ప్రళయము అంటే తెలియగలదు. ఇప్పటికయినా మించిపోయినది లేదు. దేవుడు చెప్పిన సత్యము తెలియాలంటే, ఖురాన్ గ్రంథములోని ప్రతి వాక్యము సత్యమైయుండి ఎవరికైనా జవాబు ఇవ్వగలదని తెలియండి. మేము వ్రాసిన **"సమాధి", "జనన మరణ సిద్ధాంతము", "మరణ రహస్యము", పునర్జన్మ రహస్యము"** అను గ్రంథములు చదవండి. అప్పుడు ఖురాన్ గ్రంథము ఎంత ఉన్నతస్థాయిలో ఉన్నదో అర్థమవుతుంది. అప్పుడు ఖురాన్‌లోని ప్రతి వాక్యమును సత్యసమేతముగా విడదీసి చెప్పవచ్చును.

సూరా 50, ఆయత్ 21లో ఉండే విషయము మూడు ఆత్మల విషయము. ఇదే విషయమునే భగవద్గీత గ్రంథములో పురుషోత్తమ ప్రాప్తి యోగమున 16, 17వ శ్లోకములలో క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడని ఎవరినయితే చెప్పారో, వారిని గురించి బైబిలు గ్రంథములో మత్తయి సువార్తయందు 28వ అధ్యాయము 19, 20 వచనములలో తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మయని చెప్పారు. ఇదే విషయమునే దివ్య ఖురాన్ గ్రంథములో సూరా 50, ఆయత్ 21యందు **"తోలబడేవాడు, తోలేవాడు, సాక్షిగా ఉండేవాడు"** అని చెప్పారు. ఈ మూడు గ్రంథముల విషయమును ఒకే విషయముగా గ్రహించవచ్చును. భగవద్గీతలో క్షరుడు అనగా నాశనమగువాడు అనియూ, అక్షరుడనగా నాశనము కానివాడు అనియూ, పురుషోత్తముడు అనగా ఇద్దరి పురుషులకంటే ఉత్తముడు అని అర్థముతో చెప్పారు. భగవద్గీత గ్రంథములోని జ్ఞానమే మిగతా రెండు గ్రంథములలో

సమయస్ఫూర్తిగా చెప్పారు. భగవద్గీతలో లోకములో ఇద్దరు పురుషులున్నా రనీ వారినే క్షరుడు, అక్షరుడు అంటారనీ, క్షరుడు సర్వ జీవరాశులలో నాశనమగు జీవాత్మగా ఉండగా, అక్షరుడు నాశనముకాని ఆత్మగా జీవునితో పాటుయున్నాడనీ చెప్పడమేకాక, ఇద్దరి పురుషులకంటే అనగా క్షరుడు అక్షరుడుకంటే ఉత్తమమైన పురుషుడు మరొకడున్నాడనీ, అతనినే పురుషోత్తముడు అంటారని చెప్పారు. క్షర, అక్షర, పురుషోత్తములను ముగ్గురి ప్రస్తావన బైబిలు మత్తయి సువార్త చివరిలో చెప్పుచూ క్షరున్ని కుమారుడనీ, అక్షరున్ని తండ్రి అనీ, పురుషోత్తముడయిన దేవున్ని పరిశు ద్ధాత్మయని చెప్పడమైనది. అదే విషయమునే అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్‌లో దేవుడు తెలివిగా జీవున్ని తోలబడేవాడు అనీ, ఆత్మను తోలేవాడు అనీ, దేవున్ని సాక్షి అనీ చెప్పారు. ఈ మూడు ఆత్మల విషయము భగవద్గీతను బోధించు స్వామీజీలకే అర్థము కాలేదు. మాచే రచింపబడిన **"త్రైత సిద్ధాంత భగవద్గీత"**లో తప్ప మూడు ఆత్మల వివరము ఏ భగవద్గీతలో లేదు. ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీత జ్ఞానమే హిందువులలోని స్వామీజీలకే అర్థము కానప్పుడు, మతపిచ్చిలో మునిగిపోయిన మిగతావారికి అర్థము అగుట దుర్లభము. శరీర యంత్రాంగము తెలిసిన యోగులకు తప్ప, ఇతరులకు మూడు ఆత్మల వివరము అర్థమగుటకు వీలులేదు. అటువంటప్పుడు ఇటు క్రైస్తవులకు, అటు ముస్లీమ్‌లకు ఏమి అర్థమయిందో, మూడు ఆత్మల సిద్ధాంతమును **"త్రైత సిద్ధాంతము"** అను పేరుపెట్టి మేము వివరముగా చెప్పుచున్నా అర్థము చేసుకోకపోగా, మమ్ములను ఎక్కిరించువారికి సాక్షి ఎవరో, తోలేవాడు ఎవడో, తోలబడేవాడు ఎవడో ఎలా తెలియగలదు? ఒకవేళ నాకు తెలియునన్నా అది బుకాయింపు తప్ప సత్యముకాదు. అంతెందుకు ఇప్పుడు మీరు చెప్పారు కదా! 18 నుండి 30 వరకు చదవండియని, నా విషయము అటు ప్రక్కన పెట్టండి. 'ముగ్గురు' విషయము

నాకు తెలియదనుకోండి. మీకు తెలియునేమో చూచుకోండి. తెలిసియుంటే దేవునికి చెప్పుకోండి, మీ జ్ఞానము సరియైనదైతే దేవుడు మిమ్ములను దగ్గరకు తీసుకొంటాడు, సరియైనది కాకపోతే మిమ్ములను తననుండి దూరముగా తోస్తాడు.

**ఖాదిర్ :-** ప్రియ సోదరులారా! ఖురాన్ బోధలు చాలా స్పష్టముగా ఉన్నాయి. ఎలాంటి వక్రత అందులో లేదు. కనుక చిత్తశుద్ధితో చదవండి. సత్యమును గ్రహించండి. అర్థముకాని తత్త్వము వెంటపడి జీవితమును పాడు చేసుకోకండి.

**మేము :-** ఖురాన్ బోధలలో వక్రతలేదు, అయితే మతమును నెత్తిన పెట్టుకొని దాని ధ్యాసలో మాట్లాడు వారిలో వక్రతయున్నది. ఖురాన్ చాలా స్పష్టముగాయున్నదని మాకు కూడా తెలుసు. అందులోని స్పష్టత మీకు తెలిసియుంటే అల్లాహ్ ఒకచోట సృష్ఠిని తయారు చేయుటకు తాను ఆరురోజులు శ్రమించి, ఏడవ రోజు విశ్రాంతి తీసుకొన్నాడని చెప్పాడు, మరియొక చోట దేవుడు ఏమీ చేయడు, దేవుడు ఏదయినా అనుకుంటే అయిపోతుంది అన్నాడు. దేవుడు ఆరురోజులు పనిచేయునన్నది నిజమా? ఏమీ చేయడు అయిపో అంటే అయిపోవునది నిజమా? మీరు వివరముగా శాస్త్రబద్ధముగా చెప్పగలరా? చిత్తశుద్ధితో చదవండి, సత్యము గ్రహించండి అని చెప్పారు కదా! ఈ విషయములో మీరు సత్యమును గ్రహించారా? అర్థముకాని విషయముల వెంటపడి జీవితమును పాడు చేసుకోవద్దని కూడా సలహా చెప్పారు. మీ సలహా ప్రకారము దేవుడు ఆరురోజుల సృష్ఠిని లేక ఏమి చేయని విధానము అర్థము కాలేదని వదలివేయమంటారా? చిత్త శుద్ధితో చదివితే స్పష్టముగా అర్థమవుతుందని చెప్పి, అర్థముకాని విషయము లను వదలివేయమనడము సమంజసమా?

అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో నాకు అత్యంత ఇష్టమైన సూరా 112. అందులో నాలుగు ఆయత్‌లు మాత్రమే గలవు. నాలుగు ఆయత్‌లు దేవునికి దగ్గరగాయున్న వాక్యములుగా ఉన్నాయి. మేము ముందే చెప్పాము. ఖురాన్‌లో సగానికి పైగా సూక్ష్మజ్ఞానముతో నిండిన వాక్యములే ఉన్నాయి. అయినా చాలాచోట్ల ఎంతో వివరముగా చెప్పుచున్నాము అని కూడా చెప్పారు. శ్రద్ధ, బుద్ధిగలవారికి నా వాక్యములు అర్థమగునని 3-7 లోనే చెప్పారు. అయితే ఆ మాటను ఎవరూ గమనించలేదు. నేడు చాలామంది ముస్లీమ్ పెద్దలు వక్రబుద్ధియున్నవారు ఈ వాక్యమును అడ్డము పెట్టుకొని ఆ వాక్యముల జోలికి పోకూడదని మిగతా ముస్లీమ్ లందరినీ మభ్యపెట్టుచున్నారు. ఆ వాక్యముల అవసరము లేకపోతే వాటిని ఖురాన్ గ్రంథములో చెప్పవలసిన అవసరమే లేదుకదా! దేవుని మీద శ్రద్ధతో బుద్ధిని ఉపయోగించి చూస్తే వాని శ్రద్ధనుబట్టి వాని బుద్ధికి దేవుడు జ్ఞానము అర్థమగులాగున చేయును. శ్రద్ధలేనివాని బుద్ధికి జ్ఞానము అర్థము కాదు. దేవుని మీద విశ్వాసమున్న వారికి దేవుడన్న భక్తియుండును. విశ్వాసము అనగా దేవుడున్నాడను నమ్మకము, దేవుడు ఒక్కడేయను నమ్మకము, దేవుని జ్ఞానము తెలియుటకు విశ్వాసము అవసరములేదు. **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం"** అను భగవద్గీత వాక్యము ప్రకారము శ్రద్ధయున్న వానికి దేవుని జ్ఞానము లభించును. అయితే ముస్లీమ్‌లకు దేవునిమీద విశ్వాసమున్నదిగానీ, శ్రద్ధలేదు. శ్రద్ధలేకనే కదా అర్థముకాని విషయముల వెంట పడకుండా వాటిని వదలివేయమని అన్నారు. జ్ఞానమును తెలుసుకోవాలను శ్రద్ధయున్న వారు అలా అనరు కదా!

ముఖ్యముగా చెప్పడమేమంటే విశ్వాసము వలన దేవునిమీద భక్తి ఏర్పడును. భక్తి, విశ్వాసము రెండూ ఒక కోవకు చెందినవి. శ్రద్ధయున్న వానికి జ్ఞానము కల్గును. శ్రద్ధ, జ్ఞానములు రెండూ ఒక కోవకు చెందినవని

చెప్పవచ్చును. ముస్లీమ్‌లకు దేవునిమీద విశ్వాసము నూటికి నూరు పాళ్ళు గలదుగానీ, దేవునిమీద శ్రద్ధ, దేవుని జ్ఞానముమీద శ్రద్ధ చాలా తక్కువ. అందువలన దేవుని జ్ఞానము ఖుర్‌ఆన్ గ్రంథములో సంపూర్ణముగా ఉండినా, అది వారికి అర్థము కాలేదు. వారు గ్రంథమును చదివినా, జ్ఞానమంతయూ తప్పు భావములో అర్థమవడమేకాక, ఎవరు చెప్పినా విననట్లు చేసి తమకు తెలిసిన జ్ఞానమే సరియైనదని అనిపించును. అందువలన వారికి దేవుడే దిగి వచ్చి చెప్పినా ఒప్పుకోరు. పైగా మా జ్ఞానము నీకు తెలియదని దేవునికి కూడా బదులు చెప్పుదురుగానీ ఎదుటివాడు ఎంతటివాడో అని ఏమాత్రము ఆలోచించరు.

దేవుని మీద విశ్వాసము భక్తిని పెంచుతుంది, అలాగే దేవుని మీద శ్రద్ధ జ్ఞానమును పెంచుతుంది. ముస్లీమ్‌లకు విశ్వాసముండుట వలన అందరికంటే దేవునిమీద భక్తి ఎక్కువగా యుండును. అందువలన మిగతా మతములవారు ఎవరూ ప్రార్థన చేయని విధముగా ప్రతి దినము ఐదుమార్లు ప్రార్థన (నమాజ్) చేయు ముస్లీమ్‌లు కలరు. అయితే ఖురాన్ గ్రంథమును వారు ఎంత గౌరవప్రదముగా చూచుకొన్నా, వారికి అందులోని జ్ఞానము అర్థము కాలేదనుటకు తార్కాణముగా ఒక విషయమును చూస్తాము. నా కిష్టమైన సూరా 112 అని చెప్పాను కదా! అందులోనే **"ఆయనకు సంతానము లేదు"** అను వాక్యము కలదు. ఆ మాట వాస్తవమే, అయినా అదే గ్రంథమందే సూరా 6, ఆయత్ 101లో ఇలా కలదు. **(6-101) "ఆకాశమును, భూమిని తయారు చేసినవాడు ఆయనే. దేవునికి భార్యయే లేనప్పుడు సంతానము ఎలా కలుగుతుంది? ఆయన ప్రతి వస్తువును సృష్ఠించాడు. అట్లే ప్రతి జీవరాశిని సృష్ఠించాడు. ఆయనకు ప్రతీది బాగా తెలుసు".** ఈ వాక్యములో ఆయన ప్రతి జీవరాశిని సృష్ఠించినప్పుడు ఆయనకు భార్య లేకపోతే సంతానము ఎలా కలుగుతుందని, తాను పుట్టించిన

జీవరాశులను దేవుని సంతానముగా చెప్పుచూ, భార్యలేనప్పుడు సంతానమెలా కలుగుతుందని ప్రశ్నించాడు. అయితే 112వ సూరాలో "ఆయనకు సంతతి లేదు", భాగస్వామ్యమయిన భార్యలేదని చెప్పారు కదా! అని అడిగితే దానికి జవాబు చెప్పకుండా దాటివేయడమేకాక, అది అంతే! అల్లా చెప్పిన దానిని వినవలెను గానీ ప్రశ్నించకూడదు అని అంటున్నారు. ఇక్కడ వారివద్ద సమాధానము లేదని సులభముగా తెలిసిపోవుచున్నది. అంతేగాక ఈ ఆయత్‌లకు సంబంధించిన జ్ఞానము వారివద్ద లేదని అర్థమగుచున్నది. దీనికంతటికీ కారణము వారికి దేవుని జ్ఞానముమీద శ్రద్ధలేకపోవడమేనని తెలియుచున్నది. అయితే వారు తమ దగ్గర జ్ఞానము లేదను భావము లేకుండా, తాము సంపూర్ణ జ్ఞానులమనే అనుకొంటూ ఇతరులను విమర్శించుచున్నారు. అయితే దేవుడు అన్నిటినీ గమనించు చున్నాడు.

**ఖాదిర్ :–** మీరెందుకు దివ్య ఖురాన్ వాక్యాలను వక్రీకరిస్తూ బోధిస్తున్నారు?

**మేము :–** మేము ఖురాన్ వాక్యములను గౌరవిస్తున్నాము. ఖురాన్ సమస్త మానవాళికీ చెప్పిన గ్రంథమయిన దానివలన దానిమీద మీకు ఎంత హక్కువుందో మాకు కూడా అంతే హక్కుగలదు. అల్లా అందరికీ దైవమే. దైవగ్రంథమైన ఖురాన్ కూడా అందరి గ్రంథమే. ఖురాన్ ఒక మతమునకు సంబంధించినది కాదు. మూడు మతములవారికి **"హితబోధిని"** అని గుర్తుంచుకోండి.

**ఖాదిర్ :–** మీరు దివ్య ఖురాన్ సందేశాన్ని అర్థము చేసుకొనివుంటే విగ్రహాలు ప్రతిష్ఠించే వారు కాదు.

**మేము :–** మేము ఖురాన్ జ్ఞానము ఎక్కడ తప్పు భావమునకు లోనయిందో అక్కడ దానిని సరిచేయుచున్నాము. నిజ భావమును తెల్పుచున్నాము. మేము అసలయిన దేవుడు ఒక్కడేయనీ, ఆయన ఒక్కడే సృష్ఠికంతా అధిపతి

మరియు అధికారియని చెప్పుచున్నాము. మేము విగ్రహాలను ప్రతిష్ఠించలేదు. మేము ప్రతిష్ఠించినది శ్రీకృష్ణప్రతిమను ఒక్కదానినే. ఆయన భగవంతు డయిన దానివలన ఆ పని చేయవలసి వచ్చినది. గ్రహము అంటే దయ్యము అని అర్థము. విగ్రహము అంటే పెద్ద దయ్యము లేక విశేషమైన దయ్యము అని అర్థము. మేము దయ్యాలను పూజించేవారము కాదు.

**ఖాదిర్ :-** మీరు పెట్టుకున్న నామాలు దేవుని గుర్తు అన్నారు. నామాలు పెట్టుకోమని ఖుర్‌ఆన్‌లో ఏ వాక్యమందువుందో చూపగలరా?

**మేము :-** మేము నామాలు పెట్టుకోలేదు. దేవుని చిహ్నమును పెట్టు కొన్నాము. మేము పెట్టుకొన్నవి నాలుగు చక్రములు. నాలుగు చక్రములు గుర్తుకు ఖుర్‌ఆన్ గ్రంథములో విశేషమైన అర్థము గలదు. అదే విషయమునే ఈ గ్రంథములో వ్రాశాము. కట్టె, కొట్టె, తెచ్చె అను మూడు మాటలలో రామాయణ సారాంశమును చెప్పినట్లు దేవుని జ్ఞాన సారాంశమంతయూ క్లుప్తముగా ఇమిడ్చి చూపినదే నాలుగు చక్రముల గుర్తు, దేవుని జ్ఞానముతో కూడుకొనుట వలన ఈ నాలుగు చక్రాలను **"దేవుని చిహ్నము లేక దేవుని గుర్తు"** అని చెప్పుచున్నాము. దేవుని గుర్తును గౌరవించమని సూరా 22 ఆయత్ 32లో కలదు చూడండి. **(22-32) "అల్లాహ్ చిహ్నాలను ఎవరయినా గౌరవిస్తున్నారంటే, అది వారి హృదయాలలోని భక్తి భావము వల్లనే"** అంతేకాక **(5-2) "విశ్వసించిన ఓ ప్రజలారా! అల్లాహ్ చిహ్నాలను గానీ, నిషిద్ధ మాసాన్నిగానీ అగౌరవపరచకండి"** అని కలదు. అల్లాహ్ చిహ్నాలను గౌరవపరచడము అంటే వాటిని ఉన్నతస్థానములో పెట్టుకోవడమే. అంతకంటే గౌరవమేముండును.

**ఖాదిర్ :-** ఖురాన్‌లో మరణానంతరము దైవ న్యాయస్థానములో కర్మల గురించి ప్రశ్నించడము జరుగుతుందని వుంది. మీరేమో పునర్జన్మ సిద్ధాంతాన్ని ప్రచారము చేస్తున్నారు.

**మేము :-** మరణానంతరము దైవ న్యాయస్థానముండుట నిజమే. అయితే అక్కడ ప్రశ్నించడము, అడగడము వుండదు. ఎవడు చేసుకొన్న కర్మకు వాని ఫలితమును నిర్ణయించి పంపడము తప్ప సంజాయిషీ అడిగేదంటూ వుండదు. చచ్చినవాడు ఏమి చెప్పినా వినేవారు ఉండరు. వాడు చెప్పుకొను అవకాశమే ఉండదు. చనిపోయిన వెంటనే వాని కర్మఫలమును ఒక సెకనులో పదవవంతు కాలములో నిర్ణయించడము జరిగిపోవును. అదే సెకనులోపే వాడు తిరిగి జన్మించును. ఆలస్యమనుమాట, విశ్రాంతి అనుమాట లేదు. ఈ విషయము మీకు క్రొత్తగా ఉన్నా ఇది అక్షర సత్యము.

**ఖాదిర్ :-** మీరు ఎవరు?

**మేము :-** మీరు నన్ను ఎవరని అనుకుంటున్నారో మేము వారమే.

**ఖాదిర్ :-** మీ విశ్వాసాలు ఏమిటి?

**మేము :-** మాకు విశ్వాసాలు ఉండవు. మాకున్నది ఒకే ఒక దేవుని జ్ఞానము మరియు దానిమీద శ్రద్ధ.

**ఖాదిర్ :-** మీరు ఏ గ్రంథాన్ని నమ్ముతారు?

**మేము :-** దైవగ్రంథములయిన భగవద్గీత, బైబిలులో నాలుగు సువార్తలు, ఖుర్‌ఆన్‌లో దేవుని వాక్యములను నమ్ముతాము.

**ఖాదిర్ :-** అంతా అయోమయముగావుంది! వాస్తవాలను నమ్మేవారు మాటలతో జనులను అయోమయములో పడవేయరు.

**మేము :-** వాస్తవము చెప్పాలంటే నేను మిమ్ములను అయోమయములో పడవేయడానికే వచ్చాను. అప్పటికయినా నిజ దైవజ్ఞానమును తెలుసుకోగలరు.

**ప్రశ్న :-** "అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు" అనే గ్రంథము

మీద ముస్లీమ్‌యేతర వ్యక్తి ఫోటోను ఎలా వేశారు? అది మాకు అభ్యంతరకరము.

**జవాబు :-** దేవుని మీద విశ్వాసమున్న వానిని 'ముస్లీమ్' అంటాము. అంతేగానీ దేవుని జ్ఞానము వద్ద మతముండదు. నేను ముస్లీమ్ మతస్థుడను కాను, నేను మతములో హిందువును అయినా విశ్వాసములో గట్టి ముస్లీమ్‌ను అట్లు కాదనగలరా? నేను **"అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు"** అను గ్రంథమును ముస్లీమ్ మతస్థుల కొరకు వ్రాయలేదు. హిందువులు చదువాలని ఖురాన్‌లోని గొప్పతనమును తెలియాలను ఉద్దేశ్యముతో వ్రాశాము. గ్రంథము మీద మా ఫోటోవుండుట వలన నా మీద అభిమానముతో, గౌరవముతో కనీసము పదివేలమంది హిందువులు గ్రంథమును చదువగలిగారు. చదివిన తర్వాత ఖుర్ఆన్‌లో ఇంతగొప్ప జ్ఞానమున్నదా! అని ఆశ్చర్యపోయారు. నా బొమ్మ వలన ఇంకా పదివేల మంది హిందువులు "అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు" అను గ్రంథమును చదువగలరు అలా చదువుటకు మీకు అభ్యంతరమా?

**ప్రశ్న :-** మీరు ముస్లీమ్ గ్రంథాలను వ్రాయడము సంతోషమే, కానీ ముస్లీమ్ పండితుల యొక్క పర్మిషన్ తీసుకొని వ్రాయాలి?

**జవాబు :-** ఇదేమయినా మీ ప్రపంచ ధనమా లేక మీ ప్రపంచ ఆస్తియా! లేకపోతే ఏ దేవుడయినా మీకు పట్టా చేసి ఇచ్చాడా? ఖురాన్ గ్రంథము దేవుని గ్రంథము అది ప్రజల అందరి సొత్తు. ఎవరు ఎవరిని అడుగవలసిన పని లేదు. మేము చేసే మంచి పనికి సంతోషపడాలిగానీ, అనుమతి తీసుకొన్నారా అని అడగడమేమిటి? పండితులు ఎవరో చెప్పండి. అప్పుడు వారి పర్మిషన్ తీసుకొంటాము. దైవజ్ఞానము సముద్రములాంటిది ప్రపంచ విషయములో పండితులుండవచ్చును గానీ, దైవజ్ఞానములో దేవుడే పండితుడు. పండితులకు పండితుడైన దేవుడే ఏమీ తెలియని మాచేత

దానిని వ్రాయించాడు. మీకు చేతనయితే అలా ఎందుకు మా పర్మిషన్ లేకుండా వ్రాయించావని అడగండి. డబ్బులు నీ స్వంతమయినా ఫైనాన్సు మినిష్టర్‌ను అడిగి ఖర్చు పెడతావా? అది ఎలా లేదో ఇది కూడా అలానే అవసరములేదు. మతము అను పిచ్చిని వదలి అందరికీ దేవుడు అధికారియనీ, అందరము ఆయన ఆధీనములోని వారమేనని మరువ కూడదు.

**ప్రశ్న :-** "అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు" అను గ్రంథములో చివరి పేజీలలో పరదా యొక్క వివరణలో పరదా తీసివేయమన్నట్లున్నది?

**జవాబు :-** మా గ్రంథములో 'పరదా' ఎట్లు వచ్చిందో, ఎప్పుడు వచ్చిందో, ఎలా వచ్చిందో చెప్పాముగానీ, తీసివేయమని మేమెలా చెప్పగలము. అది మీ సమాజమునకు దేవుడు ఇచ్చిన 'రక్ష' కావచ్చు లేక 'శిక్ష' కావచ్చు. దేవుడిచ్చిన దేనినయినా వద్దనకూడదు కదా!

**ప్రశ్న :- "ఖురాన్‌లో ఆణిముత్యములు"** అను గ్రంథము వెనుకవైపు మూడు మతముల గుర్తులున్న వేరే గ్రంథము ఫోటో ఉన్నది. మా ఇంట్లో దానిని చూస్తూనే 'ఓం' బొమ్మవుండే కాగితము కూడా మన ఇంట్లోకి రాకూడదని అట్లావస్తే అల్లాకు కోపము వస్తుందని అన్నారు నిజమేనా? దేవున్ని 'అల్లాహ్' అనే అనాలి 'దేవుడు' అని అనకూడదన్నారు, దేవున్ని 'అల్లాహ్' అనే ఎందుకు అనాలి? నా వయస్సు 16 సంవత్సరములు, నాకు ఏమీ తెలియదు. దయ చేసి చెప్పండి?

**జవాబు :-** దేవుని జ్ఞానము తెలిసినవారు ఎవరూ అట్లనరు. ఈ మాటలు అన్నారంటే వారికి దైవజ్ఞానము తెలియదని అర్థము. మనము ముస్లీమ్‌లు కాబట్టి నీళ్ళను నీళ్ళు అనకూడదు పానీ అనియే అనాలి అని ఒకడు అనేవాడు. వాడు ప్రయాణములో వేరే ఊరికి పోయినప్పుడు నీరు

దాహమేసింది. అప్పుడు అక్కడ పానీపానీ అని అడిగాడట. ఆ ప్రాంతము వారికి తురక భాషరాదు కావున పానీ అంటే పట్టించుకోలేదు. చివరకు నీరు అని అడిగితేనే నీళ్ళు దొరికాయి. చివరికి పానీని నీళ్ళని అతను అన్నాడు కదా! అట్లే దేవున్ని తెలుగు భాషలో దేవుడు అంటారు. ఇంగ్లీషు భాషలో గాడ్ అని అంటాము. అట్లే ఉర్దూ భాషలో అల్లాహ్ అని అంటాము. మనిషికి మతాల పిచ్చి పోనంతవరకు జ్ఞానిగా మారడు. అంతవరకు ప్రపంచ మాయలో చిక్కుకొని ఉండవలసిందే. ఇప్పటికయినా మించి పోయినది లేదు. అన్ని మతములను గౌరవిద్దాము, అన్ని మతములను దేవుడే సృష్ఠించినప్పుడు వాటిని చూచి అసూయపడడము తగునా? తండ్రికి ముందు వెనుక పుట్టిన కొడుకులందరూ సమానమే. ఒకే తండ్రికి పుట్టిన అన్నతమ్ములను మనము ద్వేషించము కదా! అట్లే ఒకే దేవుని సృష్ఠి అయిన అన్ని మతములను ప్రేమిద్దాము. అప్పుడు అందరికీ తండ్రియైన దేవుని దయను పొందవచ్చును.

దేవుడు మూసాకు 'తౌరాత్' గ్రంథమునిచ్చాడు. (దేవుడు కృష్ణుని చేత భగవద్గీతను చెప్పించాడు.) అయితే ఖురాన్ (6-91)లో "దేవుడు ఏ మానవుని మీద తన జ్ఞానమును ప్రసరించలేదు అని చెప్పినప్పుడు ఈ అవిశ్వాసులు దేవున్ని అర్థము చేసుకోవలసిన విధముగా అర్థము చేసుకోలేదు." (ఈ వాక్యమును బట్టి మూసా సాధారణ మనిషి కాదని, మూసా విషయములో మనిషికి తన జ్ఞానమును ఇవ్వలేదని, మూసాకు తౌరాత్ గ్రంథమును ఇచ్చాను అన్నప్పుడు, దేవున్ని మనుషులు సరిగా అర్థము చేసుకోలేదని తెలియుచున్నది.) "వారిని అడుగు మూసా తెచ్చిన తౌరాతు గ్రంథమును ఎవరు అవతరింపజేసినట్లు? ఆ గ్రంథము ఒక జ్యోతి, మానవుల కొరకు మార్గదర్శకత్వము మీరు దానిని వేరువేరు కాగితములుగా (వేరు వేరు గ్రంథాలుగా) విభజించి చూపుతున్నారు. ఎన్నో విషయములను

దాచేస్తున్నారు.” (ఇంతవరకు గల వాక్యములో ‘తౌరాతు’ దేవుని జ్ఞాన జ్యోతి అని తెలియుచున్నది. దానినే మూడు గ్రంథములుగా విభజించి మూడు మతాలుగా చేసుకొన్నారు. దానిలోని జ్ఞాన విషయములను కొందరు దాచిపెట్టారు.) “మీకుగానీ, మీ పెద్దలకుగానీ తెలియని ఎన్నో విషయములు ఇందులో తెలుపబడ్డాయి. తౌరాతును అవతరింపజేసినవాడు అల్లాహ్‌యే.” దీనినిబట్టి తౌరాతును చెప్పిన మూసా సాకార దేవుడయిన భగవంతుడని తెలిసిపోవుచున్నది. ఈ ఆయత్ చదివిన తర్వాత కనిపించని దేవుడు కనిపించే వ్యక్తిగా వస్తాడని తెలియుచున్నది. ఆ మాటకు ఈ ఆయత్‌యే సాక్ష్యము. ఈ వాక్యములో దేవుడు ఇచ్చిన తౌరాతును (భగవద్గీతను) మూడు వేరువేరు గ్రంథాలుగా చించుకొన్నాము అనీ అవియే భగవద్గీత, బైబిలు, ఖురాన్ అని తెలియుచున్నది. ఖురాన్‌నుండి ఈ ఆయత్ తెలిసిన ముస్లీమ్‌లు ఎంతో జ్ఞానము తెలిసినవారై మిగతా మతములుగా యున్న వారికి కూడా మనమంతా ఒకే తౌరాత్ జ్ఞానమును ఆధారము చేసుకొని ఉన్నామని చెప్పవలెను. తౌరాత్ గ్రంథమునే మూడు గ్రంథములుగా చేసుకొన్నామని తెలిసిన ముస్లీమ్‌లు మిగతా రెండు గ్రంథములను గౌరవ ప్రదముగా చూడాలి. ఖురాన్‌కు ఇచ్చిన గౌరవమునే వాటికి కూడా ఇవ్వాలి.

ఇదంతా ముస్లీమ్‌లకే ఎందుకు చెప్పుచున్నామనగా! ఖురాన్‌లో 6-91 ఆయత్‌లో ఈ రహస్యమంతావుంది. కనుక ముస్లీమ్‌లకే ఈ విషయము చెప్పుచున్నాము. ఇతర మతములలో లేని జ్ఞానము, ఇతరుల వద్దలేని మతసామరస్యము ముస్లీమ్‌లకు ఉండాలి. అయితే ఆ విషయములో ముస్లీమ్‌లు పూర్తి విరుద్ధముగా ఉన్నారు. తమ ఖురాన్ గ్రంథము తెలుగులో ముద్రించి హిందువులు చదువునట్లు ఉచితముగా పంచుతున్నారు. ఇతరులు కూడా ఖురాన్ జ్ఞానము తెలియాలని, ఖురాన్ గ్రంథమును ఇస్తే అంతకంటే మంచి పనిలేదు. అయితే అలా కాకుండా హిందువులు

ఖురాన్ చదివి వారి మతములోనికి రావాలని ఇస్తున్నారు. గ్రంథము మీద మక్కాబొమ్మ, చంద్రుడు, నక్షత్రము బొమ్మ ఉన్న గ్రంథమును ఇస్తే హిందువులు దానిని గౌరవముగా తీసుకొని, చేతనయితే చదువుచున్నారు లేకపోతే లేదు. అదే ఎవరయినా తమ గ్రంథమును ముస్లీమ్‌లకు ఇస్తే దానిని ముట్టుకునే దానికి కూడా ఇష్టపడరు. ఒక హిందూ స్త్రీ భగవద్గీత గ్రంథమును ఒక ముస్లీమ్ స్త్రీకి ఇచ్చింది. ఆ గ్రంథము ఇంటిలో ఉండగా అమె భర్త చూచి 'ఓం' అక్షరమున్న గ్రంథమును ఇంటిలోనికి కూడా రానీయకూడదని భార్యను దూషించి గీతాగ్రంథమును రోడ్డు బయట మురికి నీటి కాలువలో వేసిన సంఘటన జరిగింది. ముస్లీమ్‌లు ఇచ్చిన ఖురాన్ గ్రంథమును హిందువులు చదివినా, చదువకపోయినా గౌరవముగా ఉన్నత స్థానములోనే పెట్టుకొనియుండగా, ముస్లీమ్‌లు భగవద్గీతను 'ఓం' బొమ్మను ద్వేషిస్తూ బయటకు పారివేయడములో భగవద్గీత ఎడల ఎంత ద్వేషమున్నదో అర్థమగుచున్నది. భగవద్గీతలోని జ్ఞానమును నేను ధృవీకరించుచున్నానని ఖురాన్ భగవద్గీతను గొప్పగా చెప్పినప్పుడు, భగవద్గీతపట్ల ముస్లీమ్‌లు ఎందుకు గౌరవమును చూపలేదు? అన్నది ప్రశ్నగా మిగిలిపోతుంది. ఖురాన్‌లో (6-91) ఆయత్‌లో **"దేవుడు ఇచ్చిన తౌరాత్‌నే (భగవద్గీతనే) కాగితములుగా చింపుకొని చదువుకొంటున్నారను"** మాటను ముస్లీమ్‌లు చూడలేదా? దీనినిబట్టి మతసామరస్యము మనుషులలో లేకుండా పోయిన ఈ కాలములో, మూడు గ్రంథాలను చదివి అర్థము చేసుకొంటే, కొంత కాలానికైనా మనము సక్రమ మార్గములో ప్రవేశించగలము.

## సమాప్తము

**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

మూలకర్త

త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

# ఇందూ జ్ఞానవేదిక




ఇందూ జ్ఞానవేదిక (I.G.V)

(Estd in 1978 - Regd.No.: 168/2004)

చిన్నపొడమల(గ్రా), తాడిపత్రి(మం), అనంతపురం (జిల్లా), ఆంధ్రప్రదేశ్-515411

e-mail id : info@thraithashakam.org

**www. thraithashakam.org**

మూలకర్త

త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

# సువార్త క్రైస్తవ సంఘం








**సువార్త క్రైస్తవ సంఘం (S.K.S)**

(Regd.No.: 159/2015)

చిన్నపొడమల(గ్రా), తాడిపత్రి(మం), అనంతపురం(జిల్లా), ఆంధ్రప్రదేశ్-515411

e-mail id : info@suvarthakraisthavasangham.org




*www. suvarthakraisthavasangham.org*

మూలకర్త

త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

# ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ




ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ (K.I.S.S)

(Regd.No.: 459/2011)

చిన్నపొడమల(గ్రా), తాడిపత్రి(మం), అనంతపురం (జిల్లా), ఆంధ్రప్రదేశ్-515411

e-mail id : info@khudaislamicspiritualsociety.org



*www. khudaislamicspiritualsociety.org*

మూలకర్త

త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

# ప్రబోధ సేవా సమితి





ప్రబోధ సేవా సమితి (P.S.S.)

(Estd in 1978 - Regd.No.: 304/1991)

చిన్నపొడమల(గ్రా), తాడిపత్రి(మం), అనంతపురం (జిల్లా), ఆంధ్రప్రదేశ్-515411

e-mail id : info@thraithashakam.org




www. thraithashakam.org

మూలకర్త

త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

# రావణబ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం





**రావణబ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం** (R.B.D.B.S)

**(Regd.No.: 309/2015)**

H.No.**12-13-102**, తార్నాక, హైదరాబాద్, తెలంగాణ-**500 007.**

e-mail id : info@ravanabrahmadravidabrahmanasangham.org




***www.ravanabrahmadravidabrahmanasangham.org***

మూలకర్త

త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

# ద్రావిడ శ్రేష్ఠి సంఘం




ద్రావిడ శ్రేష్ఠి సంఘం (D.S.S)

(Regd.No.: 266/2015)

కృష్ణానగర్ కాలనీ, కొత్తకోట (మం), మహబూబ్‌నగర్ (జిల్లా), తెలంగాణ-509381

e-mail id : info@dravidashreshtisangham.org



*www.dravidashreshtisangham.org*

# దేవుని చిహ్నము

దేవుని పగలు

దేవుని రాత్రి

దేవుని నిలయము
ఏడవ ఆకాశము

ఆరవ ఆకాశము

ఐదవ ఆకాశము

నాల్గవ ఆకాశము

మూడవ ఆకాశము

రెండవ ఆకాశము

మొదటి ఆకాశము

## ఏడు ఆకాశములు



# ఇది అన్ని మతముల వారికి

www.thraithashakam.org